మధురాంతకం రాజారాం

కథలు

# వనభోజనం

చిన్నారి లోకం . . . బాల సాహిత్యం

# వనభోజనం

(కథలు)

వనభోజనం
వనభోజనం

రచన:
మధురాంతకం రాజారాం

చిత్రాలు
కె. జి. ధర్

విశాలాంధ్ర ప్రచురణాలయం
విజయవాడ-2.

## ఇందులో....

విషకన్య
సమయస్ఫూర్తి
లోకపుతీరు
వనభోజనం
టీకప్పులో తుఫాను
చిరకాల నిద్రితుడు
ఇద్దరు యాత్రికులు
ఓటమి
గోటదీరుపనికి గొడ్డలేల



కలకత్తా నగరానికి ఈశాన్యంగా యిప్పటికీ వసంతవనం అన్న పేరుతో వ్యవహరింప బడుతున్న తోటని గురించి ఆచుట్టు ప్రక్కల నివసిస్తున్న వాళ్ళు ఒక విచిత్రమైన కథ చెప్పుకుంటారు. ఆకథ అక్షరాలా యథార్థమని నమ్మేవాళ్ళు కూడా లేకపోలేదు కానీ, వాళ్ల సంఖ్యలో బహుకొద్ది మంది. ఎప్పుడో

నూరేళ్లకు ముందు జరిగి పోయింది కావడం చేతనూ, కథకు సంబంధించిన వ్యక్తులందరూ కాలగర్భంలో కలిసిపోవడం చేతనూ, ఆకథ నిజంగా జరిగిందని నిరూపించడానికి యిప్పుడాధారాలు బొత్తిగా లేవు. అందుకు తోడుగా బుర్ర ఖాళీగా లేని మనుషులందరూ కూర్పులతోనూ మార్పులతోనూ అసలు కథకు, నేటి కథకు పోలికలులేకుండా చేసేందుకు ఏదో తమ శక్తి కొలది ప్రయత్నిస్తూ వచ్చారు. అందుచేత నేడు మనకు లభ్యమైన కథలో నిజమెంత, అబద్ధమెంత అన్న మీమాంసకు దిగడ మేమంత ప్రయోజన కరమైన విషయం కాదు.

ఈనాడు వసంతవనంగా కలకత్తా పౌరులచేత పిలువబడుతున్న తోట ఏదైతే వుందో అది పూల తోట కాదు. అక్కడ పూలచెట్లకు బదులు ముండ్ల పొదలు పెరుగు తున్నాయి. ఒకప్పుడు మల్లెతీగలు మొలచి పందిరిపైకి అల్లుకుని ముచ్చటగా పువ్వులు పూచినచోట యిప్పుడు బాకుల్లాంటి ఆకులతో ఈత చెట్లున్నాయి. నందివర్ధనం పువ్వులు నవ్వినచోట నల్ల తుమ్మ చెట్లు ముండ్లతో ఇకిలిస్తున్నాయి. గులాబీల కమ్మని వాసనలు గాలితో కలసి అక్కడ నడయాడే

వారికి మత్తు కలిగించేవట ఆరోజుల్లో! ఈ రోజుల్లో చంద్రకంపలు అక్కడ రెప రెప లాడుతుంటాయి.

ముండ్ల పొదల మధ్యన త్రోవ చేసుకుని జాగ్రత్తగా తోటమధ్యకు వెళ్ళినట్లయితే ఒక శిధిల మందిరం చూపరులకు దృగ్గోచర మౌతుంది. నందన వనం మూడు పువ్వులు ఆరు కాయలతో శోభించిన ఆరోజుల్లోనే ఆ మందిరాన్ని సమీపించడానికి ఎవరూ సాహసించలేక పోయేవాళ్ళట! ఇప్పుడాపాడుగోడల్లో గబ్బిలాలు, గ్రుడ్లగూబలు మాత్రం నివసిస్తాయి. లేదంటే అప్పుడప్పుడూ అపరాధ పరిశోధక నవలలు వ్రాసే రచయితలు చోరనాయకుల నివాసాన్ని వర్ణించ డానికిముందొకసారి అక్కడికి పోయి వస్తుంటారు.

ఈనాటి నందనవనం పరిస్థితి యిది!

ఉన్నత విద్యాభ్యాసం కోసం నలభై మైళ్ళ దూరాన వున్న కుగ్రామం నుంచీ కలకత్తాకు వచ్చిన మహేశబాబు నగరంలో తనకెవరూ పరిచితులు లేక పోవడం వల్ల సాయంత్రం వరకూ వీధుల్లో తిరుగుతూ ఉండిపోయాడు. సూర్యు డస్తమించాడు. చీకటిపడింది. ఆతడు మెల్లగా కాళ్ళీడ్చుకుంటూ తన బసకు చేరు

కున్నాడు. వంటమనిషి అన్నం గదిలోనికే తెచ్చి వడ్డించింది. నాలుగు మెతుకులు నోట్లో వేసుకుని అతడు పడకపై పడుకోబోతుండగా ఆ పూటకూటి యింటి యజమానుడు రాసబిహారి "ఏర్పాట్లలో ఏదైనా లోపంవుందా మహేశబాబుగారూ!" అంటూ లోపలికి వచ్చాడు.

"ఏర్పాట్లకేమండీ! అన్నీ చాలా బాగున్నాయి. కాదంటే ఒక చిన్న కొఱతమాత్రం నాకు స్ఫురిస్తోంది. అదీ ఏమంత చెప్పుకోతగింది కాదు. ఈ గది నా కెందుచేతనో ఒక చిన్న చెఱసాలలా కన్పిస్తోంది. కావలసినంత గాలీ, వెలుతురూ ఇక్కడికి రావడం లేదు. హమేషా చదువుకుంటూ వుండవలసినవాణ్ణి కాబట్టి." అంటూ అర్ధోక్తిలో ఆగిపోయాడు మహేశ బాబు.

రాసబిహారి మహేశబాబు మాటల్లో ఏదో కొండంత ఛలోక్తి వున్నట్లు బిగ్గరగా నవ్వి "పల్లెటూరినుంచి వచ్చి పట్నంలో కాపురం పెట్టేవాళ్ళకో వచ్చే చిక్కు యిదేనండీ మహేశబాబుగారూ! ఐనా ఈ గదిలో మీరు గాలీవెలుతుర్ల కంత ముఖంవాచి పోవలసిన అవసరం లేదు. ఇప్పుడు తెఱచుకొని వున్న

కిటికీగాక మరొకటికూడా ఈ గదిలో వున్నమాట మీరు మరచిపోయినట్టున్నారు. అవసర మైనప్పుడు మీరు దాన్ని తెలుచుకుంటేచాలు, కావలసినంత గాలీ వెలుతురు లోపలికివచ్చి మిమ్మల్ని ముంచివేస్తాయి." అన్నాడు.

"అలాగా ! నేనా కిటికీవల్ల గూడా అంత ప్రయోజనం వుండదనుకుంటాను" అన్నాడు మహేశ బాబు.

"అలసి పోయినట్టున్నారు ! పడుకోండీ" అన్నాడు రాసబిహారి.

మహేశబాబు నిద్రపోవడానికి ఎన్నో ప్రయత్నాలు చేశాడు. ఎక్కడో దూరంలోవున్న కుంఫిణీ వారి కార్యాలయంలో గంట పన్నెండుసార్లు మ్రోగింది. మంచంపైన పడుకొని అటూ యిటూ దొర్లుతూ వృధాగా కాలయాపనం చేయడంకన్నా కొంతసేపు చదువుకున్నా బాగుండునని మహేశబాబు లేచి కూర్చు న్నాడు. గదిలో దీపం ఎప్పుడో ఆరిపోయింది. మళ్ళీ వెలిగించడానికి అగ్గిపెట్టె కన్పించలేదు. చిరాకుతో అతడు గదిలో పచారు చేయసాగాడు. గదిలో గాలి బాగా ఆడనందువల్ల తల దిమ్మెక్కి పోయింది. తెలి

చిన కిటికీ గుండా బయటికి చూచాడు. ఆకాశం కానీ, భూమికానీ కానరాలేదు. ఒక మేడ అడ్డంగా నిలబడి వుంది. తెలివకుండా వున్న మరోకిటికీ సంగతి అప్పుడు మహేశబాబుకి జ్ఞప్తికి వచ్చింది. అతడు చీకటిలో తడవి చొక్కాన్ని ఊడదీసి కిటికీ తలుపుల్ని తెరిచాడు.

తెలిచిన తర్వాత రెండుమూడు నిమిషాలవరకూ మహేశబాబు ఆకస్మికంగా ఆకాశాన అలముకున్న ఆషాడ మెఘాన్ని చూచి మేనుమరచిన నెమలికన్నెలా ఆనంద పరవశుడై పోయాడు.

ఆ దృశ్యం అలాటిది. ఆకాశాన్ని ముద్దిడు కోవాలనే దీక్షతో కొన్ని చెట్లు నిటారుగా పెరిగిపోతు న్నాయి. పూలతీగలు వాటికంటే పైకి పెరిగిపోదలచు కున్నప్పటికీ పైన ఆలంబనం లేనందువల్ల క్రిందికి వ్రేలాడు తున్నాయి. తోటకొాక మూలలో వున్న సరో వరంలో రంగు రంగుల తామర పువ్వులు వికసించి వున్నాయి. జల యంత్రాల్లో నుంచీ జలధారలు ఎడ తెలిపి లేకుండా పై కెగురుతున్నాయి. ఆకుల్ని సైతం కనబడనీయకుండా పువ్వులు కొల్లలు కొల్లలుగా పూచి గాలికి అల్లల నాడుతున్నాయి. అందమైన ఆ వుద్యాన వనంలో ముచ్చటైన ఒక చిన్న మేడవున్నది. చుట్టూ

వ్యాపించిన పూలతీగ మధ్య ఆ మేడ ఒక పూల పల్లకిలా కన్పిస్తున్నది.

రెప్పపాటులేని కళ్ళతో కిటికీ దగ్గర నిలబడి మహేశబాబు ఆ పూలతోటని చూస్తూ వుండగానే కుంఫిణీ వారి కార్యాలయం తాలూకు గంట మళ్లీ ఒక సారి మ్రోగింది. కానీ ఆ ఘంటారావం మహేశబాబుకి వినిపించలేదు!

ఉన్నట్లుండి ఏదో భూతంచేత ఆవేశింపబడిన వ్యక్తిలా మహేశబాబు పూర్తిగా మారిపోయాడు. అతడి కళ్ళకు పూలతోట పైకెగిరి గాలిలో నాట్యం చేస్తున్నట్టు కనబడసాగింది. గంజాయి మత్తులో ఒళ్ళు మరచిన బైరాగిలా అతడు రెండు మూడు క్షణాలబాటు అటూ, యిటూ తూలి తరువాత నేలపైన దబాలున పడిపోయాడు.

మహేశబాబు మళ్ళీ కళ్లు తెరచి చూచినప్పుడు బాల భాస్కరుని బంగారు కిరణాలు కిటికీగుండా లోనికి వస్తున్నాయి. తోటవైపు కిటికీ తలుపులు మూయబడి ఉన్నాయి. తన తలను ఒడిలో వుంచుకొని రాస బీహారి వీవనతో విసరుతున్నాడు.

"ఇదంతా ఏమిటి బీహారిగారూ! నేనెందుకు మూర్ఛపడిపోయాను?" అని అడిగాడు మహేశబాబు హీనమైన కంఠంతో.

రాసబీహారి ముఖంలో భయం తాండవిస్తున్నది. అతడు మహేశబాబు తలని తలగడకానించి మంచం పైనుంచి లేచి కుర్చీలో కూచుంటూ "మీకొక విషయం చెప్పడం మరిచాను. ఆ కిటికీ తలుపుల్ని పది పదిహేను నిమిషాలకన్నా ఎక్కువసేపు తెరవకూడదు. ఆ తోటలో కొన్ని విషవృక్షాలున్నాయని చాలారోజులుగా ఒక ప్రతీతి వుంది. వాటిగాలి సోకినట్టయితే అపాయం సంభవిస్తుందని కొందరు చెప్పుకోగా విన్నాను" అన్నాడు.

మహేశబాబు లేచి కూచోవడానికి ప్రయత్నిస్తూ "ఏమిటీ! ఏమన్నాడు? విషవృక్షాలా?" అంటూ నివ్వెరపడ్డాడు.

"అవును బాబూ విషవృక్షాలే నట! అవి యింత పని గేయగలవని నేనూ యింతవరకు అనుకోలేదు" అయినా ఆ డాక్టరు ఈలాటి పాడుపనులు ఎందుకు చేస్తారో నాకు తెలియడంలేదు అన్నాడు రాసబీహారి.

"ఏడాక్టరుగారు?" అని ప్రశ్నించాడుమహేశబాబు.

"డాక్టరు మేఘనాథ ముఖర్జీగారి పేరు విన లేదటండీ మీరు!" అన్నాడు రాసబిహారి.

"ఆ పేరు వినకేం! అసలు నేను వైద్యశాస్త్రం నేర్చుకోవాలని వచ్చింది వారిదగ్గరికేనండీ" అంటూ మహేశ్‌బాబు లేచి కూచున్నాడు.

రాసబిహారి ముఖం వెలవెల పోయింది. అతడు లేచి మంచం దగ్గరికి వచ్చి ఏదో రహస్యం చెబు తున్నట్టు మెల్లగా "మహేశబాబుగారూ! మీకా డాక్టరు గారి సంగతి పూర్తిగా తెలియదు. అపారమైన విజ్ఞాన శాస్త్రం అతడికి కరతలా మలకమన్నమాట నిజమే! ఐతే అతడి హృదయం వుందిచూడండి, అది కర్కశ పాషాణం! విషపదార్థాలపైన ప్రత్యేక పరిశోధనలు జరిపి వాటితో తయారుచేసిన విపరీతపు ఔషధాలను అతడు రోగులపైన ప్రయోగిస్తాడనీ, అతడి చేతిలో పడిన రోగులు అదృష్టవశాత్తు బతికితే తప్ప, లేకుంటే అతడి అమానుష పరిశోధనలకు బలై పోతా రని పట్టణంలో ఎక్కడ చూచినా గుసగుసలు బయలు దేరు తున్నాయి" అన్నాడు.

మహేశబాబుకు రాసబిహారి అనుమానం అంత సహేతుక మైందిగా తోచలేదు. రోగుల్ని రక్షింప వలసిన వాడుగదా వైద్యుడు! అతడు చేజేతులా

రోగుల్ని హతమార్చ గలడని అనుకోవడం ఎంత ఘోరమైన విషయం! కంచే చేను మేస్తుందా?

"రాసబిహారిగారూ! మీరీ విషయంలో పొరబడి నట్టున్నారు" అన్నాడు మహేశబాబు.

"మీరు వెయ్యి చెప్పండి మహేశబాబుగారూ! తనుచేస్తున్న విజ్ఞానశాస్త్ర పరిశోధనలముందు మాన వుడి చావుబ్రతుకులాయన కొక లెక్కలోనివి కావు. అలాగని లోకం కోడై కూస్తున్నది. తరువాత మీ యిష్టం" అని రాసబిహారి గదిలోనుంచి వెళ్లిపోయాడు.

నాలుగు రోజుల తరువాతి సంగతి. ఒకరోజు వుదయం మహేశబాబు చాలా ఆలస్యంగా నిద్రనుంచి లేచాడు. ఎంత ప్రొద్దెక్కిందో చూడ్డంకోసం కిటికీ తెరిచాడు. సూర్యకాంతితో పూలతోట కల కలా నవ్వు తున్నది. పువ్వులతో నిండిన ఆ తోటలా మహేశ బాబు మనసుకూడా ఆనందంతో నిండిపోయింది. ఐనా అతడు తొలినాటి రాత్రి జరిగిన సంఘటనని మరచి పోలేక పోయాడు. విషవాయువులు మరొక్కసారి తనపైన దాడి చేస్తాయేమో అని భయపడి అతడు కిటికీ తలుపులు మూసివేయ బోయాడు. కానీ అలా చేయకముందే మేత్రపక్కనుంచీ సరోవరంవైపున

వస్తున్న మానవాకారం ఒకటి మహేశబాబుకు ప్రత్యక్షమైంది.

అడుగులో అడుగు వేసుకుంటూ నడుస్తున్న ఆ ఒక్క పలచటి మనిషె డాక్టరు మేఘనాథ ముఖర్జీ అయి వుంటాడని మహేశబాబు వూహించాడు. అతడి వూహ యధార్ధమే. ఎముకల ప్రోవులా గాలికి అటూ ఇటూ ఊగి పోతూ. లోతుకుపోయిన కళ్ళతో ప్రపంచాన్ని నిర్లక్ష్యంగా చూస్తూ ఆపాదమస్తకం నల్లని దుస్తులు ధరించి తోటలో పచారు చేస్తున్న డాక్టరు మేఘనాథ ముఖర్జీ మహేశబాబు కళ్ళకు ఒక మాంత్రికుడులా కన్పించాడు.

ఆ తోటలోని ప్రతిచెట్టూ, ప్రతి తీగ డాక్టరు గారిచేత స్వయంగా నాటబడి పోషించబడిందని రాస బిహారి చెప్పిన మాట మహేశబాబుకు జ్ఞాపకం వచ్చింది. కానీ డాక్టరు గారికి ఆ స్థావరాల పట్ల ఏ మాత్రమైనా ఆదరంవున్నట్టు మహేశబాబుకు తోచ లేదు. డాక్టరుగారి ధోరణినిబట్టి చూస్తే ఆయన ఏవో క్రూరమృగాల మధ్య మానవ కళేబరాల మధ్య తిరుగుతున్నట్టు కనబడుతున్నదేకానీ తన తోటలో హాయిగా షికారు తిరుగుతున్నట్టు కనిపించడం లేదు. చర్మపు తొడుగుల్లో దాచుకోబడిన చేతివ్రేళ్ళతోగానీ అతడు

త్రోవకు అడ్డంగా పడివున్న తీగల్ని సవరించడంలేదు. అందుబాటులో వున్న వేలకొలది పువ్వుల్లో ఒక్క పువ్వునైనా సరే అతడు స్పృశించలేదు. సరాసరి సరోవరం దగ్గిరికి వచ్చి అక్కడ ఎర్రటి పువ్వుల్ని పూచివున్న పొదరింటి ముందు నిలబడి "విద్యుల్లతా! విద్యుల్లతా!" అని బిగ్గరగా పిలిచాడు.

"పిలిచారా నాన్నా!" అన్నదొక కంఠం మేడ లోపలనుంచి. మహేశబాబుకు ఆ రెండు మాటలు వీణా నినాదంలా వినిపించాయి.

"ఇక్కడున్నారా నాన్నా!" అంటూ దగ్గిరికి వచ్చిన కుమార్తెని దగ్గిరికి తీసుకుంటూ డాక్టరుగారు "నీ చెల్లెల్ని పరామర్శించడం నువ్వు బొత్తిగా మరచి పోయినట్టున్నావమ్మా! చూడు, ఆశ్రయం లేక తీగలెలా అల్లాడుతున్నాయో!" అన్నారు. "ఈ తీగెలు నాకంటే ఏపుగా పెరిగిపోతున్నాయి నాన్నా! నిన్న సాయంత్రమే సవరించాను. అప్పుడే చెల్లా చెదరైపోయాయి. ఉండండి ఇప్పుడే సరిచేస్తాను" అంటూ ఆ బాలిక చెల్లెలికి తల దువ్వి జడవేసి పువ్వులు ముడిచే అక్కలా పూలతీగల్ని పందిరలో సవరింప సాగింది.

అప్పటికే మహేశబాబు కిటికీ దగ్గర నిలబడి పది పదిహేను నిమిషాలు గడిచిపోయాయి. మెల్లి

మెల్లగా అతడి తల బరువెక్కుతోంది. కిటికీ తలుపుల్ని మూసివేయాలన్న ఆలోచనకూడా అతడి మనఃఫలకం పైనుంచి మాసిపోసాగింది.

పూలతీగల్ని పందిరలో చెక్కిన తర్వాత ఆ అమ్మాయి అక్కడనుంచి లేచి పూలతోటని పరకాయించి చూస్తుండగా మహేశబాబు ఆమెకు కనిపించాడు. ఆమె తెల్లబోయి నోరు తెఱచుకొని మహేశబాబుని చూడసాగింది. అవెలాటి చూపులు! ఏకాంత ద్వీపంలో కాపాలికుని సంరంక్షణంలో పెరిగిన కపాలకుండల నవకుమారుణ్ణి అలా చూచి వుంటుంది.

తనకుమార్తెకంత విస్మయాన్ని కలిగించిందేమా అని డాక్టరుగూడా తలపైకెత్తి మహేశబాబుని చూచాడు. ఆ చూపులు తీక్ష్ణతకు అతడు తట్టుకోలేకపోయాడు.

అలాటి విపరీత పరిస్థితిలో "ఆయనెవరు నాన్నా?" అని ప్రశ్నించింది విద్యుల్లత.

డాక్టరుగారు బదులు చెప్పలేదు. తలుపు మూసుకోమన్నట్టు మహేశబాబుకు చేతివేళ్ళతో సంజ్ఞచేసి, ఆయన కుమార్తెని పిలుచుకొని మేడలోకి వెళ్ళిపోయాడు.

ఉన్నట్టుండి జ్ఞాపకం వచ్చినట్టు మహేశబాబు కిటికీ తలుపుల్ని తటాలున మూసుకున్నాడు.

కొన్ని విషయాలను బట్టి ఆలోచించినప్పుడు మానవుడి మనస్సుకన్నా దుర్బలమైంది మరేదీ లేదేమో ననిపిస్తుంది. మహేశబాబు ఎంత ప్రయత్నించినా ఆ తోటవైపు కిటికీని శాశ్వతంగా మూసిపెట్టి వుంచగల మనస్థైర్యం అతడికి కలగలేదు. వెన్నెలరాత్రుల్లోనో, ప్రభాత సమయాల్లోనో అతడా కిటికీ దాపున ఒకటి రెండు గడియలు నిలబడి వుండడం మామూలై పోయింది.

ఒకరోజు విద్యుల్లత ఒక పూల గుత్తిని చేత బట్టుకొని తోటలో షికారు తిరుగుతూవుండి వున్నట్టుండి తల పైకెత్తి మహేశబాబుని చూచింది. అతడి దర్శనం ఎంత ఆనందదాయకం అయిందో ఏమోగానీ, ఆమె పట్టరానంత సంతోషంతో కిలకిలా నవ్వుతూ ఒక్క పరుగులో కిటికీ క్రిందికి వచ్చి "మీ పేరేమిటండీ?" అన్నది.

అతడు మెల్లగా "నా పేరు మహేశబాబు" అన్నాడు.

"అలాగా! అయితే ఈ పూల గుత్తిని పైకెగర వేస్తాను. పట్టుకొంటారండీ!" అని మళ్ళీ అమాయకంగా ప్రశ్నించిందామె.

"ఏది ఎగురవెయ్ చూద్దాం" అన్నాడు మహేశబాబు.

విద్యుల్లత పూలగుత్తిని పైకి విసిరింది. అది కిటికీకి రెండు బారలు క్రిందివరకూ వచ్చి మళ్ళీ ఆమె చేతుల్లోకే వెళ్ళిపోయింది.

"నేనంత ఎత్తు ఎగురవేయలేనండీ! మీరే యిక్కడికి వచ్చి దీన్ని తీసుకోకూడదూ!" అని దీనంగా అన్నది విదుల్లత.

"ఇప్పుడు కాదులే! ఇంకొకసారి వస్తాను" అంటూ తలుపుల్ని మూసుకున్నాడు మహేశబాబు.

ఆ మరునాటి ఉదయం మహేశబాబు తననెవరో పిలుస్తుండడం విని నిద్రలేచాడు. పిలుపు ఇంటిలోనుంచి గాక బయటినుంచి వినవస్తోంది. అతడు యించుక విస్మయంతో కిటికీ తెరిచాడు. క్రింద పూలతోటలో జామచెట్టుక్రింద విద్యుల్లత నిలబడి వుంది.

"పూలగుత్తి తెచ్చానండీ! మరొకసారి తీసుకుంటా నన్నారుగా!" అన్నదా అమ్మాయి.

"నా కెందుకు పూలు? నేనేం చేసుకోవాలి వాటిని? నువ్వెళ్ళిపోఅమ్మాయ్" అన్నాడుమహేశబాబు.

"పోనీ,ఒకసారి మాతోటలోకిరాకూడదటండీ!"

"ఎందుకూ?"

ఏం బదులు చెప్పాలో తోచక విద్యుల్లత తల వంచుకున్నది. కొంతసేపైన తర్వాత మళ్లీ పైకి చూస్తూ "ఎందుకో తెలియదు. నాతో ఎవ్వరూ మాటాడరు. అంతెందుకు? దగ్గరికే రానివ్వరు. దూర దూరంగా తొలిగిపోతారు. నేనేం తప్పు చేశానని నాకీ శిక్ష? ఈ నాలుగు మాటలు ఎవరికోనైనా చెప్పాలని ఎంతో కాలంనుంచీ అనుకుంటున్నాను. నాన్నగారికో చెబుదామంటే నోరు పెగలదు. ఇన్ని రోజులకు మీరు కనిపించారు. అందరిలాగానే మీకూ్కడా నేనంటే సరి పడలేదు. పోనీలెండి మహేశబాబుగారూ! మీరు వెళ్లి పొండి. నేనూ వెళ్లిపోతున్నాను" అని మేడవైపు నడిచిపోసాగింది.

"పిచ్చిదానివిగా వున్నా వమ్మాయీ నువ్వు! అకారణంగా ఏడవడ మెందుకుచెప్పు ఎప్పుడూ నవ్వు తూ వుండడానికి ప్రయత్నించాలి, తెలుసా?" అన్నాడు మహేశబాబు.



"తెలిసిందండీ" అన్నది విద్యుల్లత.

"మరొకసారి ఏడ్చావంటే, నేను నువ్వెంత పిలిచినా వినిపించుకోను."

"ఐతే నేనుఏడవను. ఎప్పుడూ నవ్వుతూనే వుంటాను మహేశబాబుగారూ !"

"నువ్వు మంచి అమ్మాయివి !"

"మా నాన్నగారు కూడా ఆమాటే చెబుతుంటారు. అన్నట్టు మీకు ఈతోటఅంతా చూడాలనుంది కదండీ !"

"లేదు. నేను త్వరగా వెళ్లిపోవాలి. ఇక్కడేవో విషవృక్షా లున్నాయట. వాటిగాలి సోకితే నాకు స్మృతి తప్పిపోతుంది."

"మరి నాకు తప్పిపోవడం లేదు కదండీ!"

"ఏమో! నీ సంగతి నాకు తెలియదు"

"అవును నాసంగతి ఎవరికీ తెలియదు." మళ్లీ విద్యుల్లత ముఖం చిన్నబోయింది.

"అబ్బబ్బ! నీతో పెద్దచిక్కే వచ్చిందమ్మాయీ ఒకసారి అలా వెళ్లివద్దాంపద!" అంటూ మహేశబాబు ముందుకు నడవసాగేడు.

తోటలో కొంతసేపు పచారు చేసినతర్వాత ఆ యిద్దరూ సరోవరం దగ్గరికి వచ్చి అక్కడొక మామిడి చెట్టుక్రింద వున్న శిలావేదికపైన కూచున్నారు.

జలయంత్రానికి దగ్గరవున్న ఎఱ్ఱటి పువ్వుల పొదరింటిని చూపుతూ మహేశబాబు "విద్యుల్లతా! ప్రపంచంలో ఎన్నెన్నో రకాల పువ్వులున్నాయి. ఐతే అందంలో ఆ ఎఱ్ఱటిపువ్వుల్ని మించిన పువ్వుల్ని నే నెక్కడా చూడలేదు" అన్నాడు.

విద్యుల్లత ఆపొదరింటి దగ్గరకు పరుగెత్తి "మహేశబాబుగారూ! మీ పుట్టినరోజు పండుగెప్పుడో

చెప్పండి" అప్పుడు ఈ పువ్వులతో ఒకదండ కట్టి మీకు కానుక యిస్తాను. ఇప్పటికి మాత్రం మీరు ఒకపువ్వుతో తృప్తిపడాలి" అంటూ ఒకపువ్వును తీగలోనుంచి త్రుంచి వేయసాగింది.

సరిగ్గా అప్పుడొక విచిత్రం జరిగింది.

పువ్వును త్రుంచబోతుండగా కాడలోనుంచీ పాలలాంటి తెల్లటి నురుగు క్రిందికిరాలి, అది నేలమీద ప్రాకిపోతున్న తొండమీద పడింది. ఒక క్షణంపాటు ఆతొండ గిలగిల లాడి నాలుకను బయటకు చాపి హృదయ విదారకంగా అరుస్తూ చనిపోయింది.

"విషవృక్షం! విషవృక్షం" అని అరుస్తూ మహేశబాబు తనవిడిది వైపుకు పరుగెత్త సాగేడు.

విద్యుల్లత పువ్వునక్కడే జారవిడిచి "పోకండి మహేశబాబుగారూ! ఆగండి! ఒకమాట" అంటూ అతణ్ణి వెంబడించింది:

"ఏమిటది?" అన్నాడు మహేశబాబు ఒకచోట ఆగి.

"అది విషవృక్ష మైతేమాత్రం మనకేంభయం? మనల్నేం చేస్తుంది?"

"ఏమీ చేయదూ?" అని మహేశబాబు ప్రశ్నించాడు.

"మీరిలా కూచోండి. దాన్నిగురించి చెబుతాను" అన్నది విద్యుల్లత.

మహేశబాబు మళ్లీ కూచున్నాడు. విద్యుల్లత కథను ప్రారంభించింది. "మానాన్నగారు విషపదార్థాలను గురించి ఎన్నో పరిశోధనలు చేశారు."

"ఆసంగతి తెలుస్తూనేవుంది"

"నేనే క్షణంలోనైతే పుట్టానో, అదేక్షణంలో నాన్నగారు ఈతీగను నాటారట! అందుచేత వాకిది చెల్లెలయింది. నాకు మూడేండ్ల వయస్సు వచ్చినప్పటి నుంచి దీనికి నీళ్లుపోసి పెంచాను."

"ఇంతే నా కథ!"

"ఇది నాచెల్లెలు మహేశబాబుగారూ! మిమ్మల్నేమీ చేయదు."

మహేశబాబు నిర్విణ్ణుడై పోయి అమాయకత్వం తొణికిసలాడుతున్న విద్యుల్లత ముఖాన్ని చూస్తూ వుండిపోయాడు. అలా అతడెంతసేపు చూస్తూ వుండి పోయేవాడో, ఏమోగానీ, అంతలో అక్కడొక మహాద్భుతమైన సంఘటన సంభవించింది.

ఒక తుమ్మెద ఝుంమని పాట పాడుతూ విద్యుల్లత దగ్గరికివచ్చి ఆమెతలచుట్టూ తిరుగ సాగింది. చేతులు విసురుతూ ఆమె దాన్ని తరిమివేయడానికి ప్రయత్నించింది. కానీ ఎందుచేతనో గానీ తుమ్మెద ఆమెని వదలి పెట్టలేదు. అక్కడే తిరిగితిరిగీ కొంత సేపటికి గిలగిల తన్నుకుంటూ గిర్రున క్రిందపడి ప్రాణం గోల్పోయింది.

మహేశబాబు లేచి నిలబడ్డాడు అతడి శరీరం గడగడ వణకిపోతున్నది. ఆశ్చర్యంతోనూ, భయం తోనూ అతడి మనసు కల్లోలితమై పోయింది. అతడు విద్యుల్లతను తీక్షణంగా చూస్తూ "మీ తండ్రిగారి విపరీత విజ్ఞాన తృష్ణ నిన్నిలా అధోగతికి తెచ్చింది. నీ ఒళ్లంతా విషపూరితమై పోయింది, విద్యుల్లతా! నీవు విషకన్యవి! ఇకమీదట నీముఖం నేనుచూడలేను" అంటూ అక్కడనుంచీ పరుగు లంకించు కున్నాడు.

గదిలోకి వెళ్లిన మహేశబాబు మంచంపైన పడుకుని ఎన్నెన్నో ఆలోచనలతో సతమతమైపోతూ అలాగే నిద్రపోయాడు.

నిద్రలేచి పరుపును చుట్టిపెట్టబోతూ దానిపైన చచ్చిపడివున్న ఈగల్ని చూచి నిర్ఘాంతపడ్డాడు మహేశ బాబు. తను బయటికి విడుస్తున్న గాలికూడా విష

పూరితమై పోయినట్టు అతడికి అనుమానం కలిగింది. ఒక్కపరుగున అతడు పెరట్లోకి వెళ్లి ఒకగులాబి పూవును త్రుంచి వాసనచూశాడు. ఆపువ్వు రెండు నిమిషాల్లో వాడిపోయి నల్లగా మాడిపోయింది.

మహేశబాబు హృదయంలో ఏదో వేదనా జ్వాల రగులుకో సాగింది. అతడు వీధిలోకి వెళ్ళి వీధిలోవున్న విష వైద్యుడి యింటికి పరిగెత్తాడు.

"బాబూ! ఒక విపరీతమైన విషప్రభావానికి నేను లోనయ్యాను. నేను విశ్వసిస్తున్న గాలితగిలి ఈగలు చనిపోతున్నాయి. విరుగుడు మందు కావాలి. ఎంత డబ్బయినా సరే యిచ్చుకుంటాను" అన్నా డతడు.

వైద్యుడు మహేశబాబు నాడిని పరీక్షించి పెదవి విరిచాడు. ఎందుకైనా మంచిదనిచెప్పి ఒక మందు అతడి చేతికిచ్చి దాన్ని నాలుగు పూటలు సేవించ మన్నాడు.

*            *            *

మహేశబాబు ఆమరునాటి వుదయం మళ్లీ డాక్టరుగారి పూలతోటలోకి వెళ్లాడు.

మామిడిచెట్టుక్రింద ఏదో ఆలోచిస్తూ కూచున్న విద్యుల్లత అతణ్ణిచూచి తెల్లబోయి "మీరింక రారనుకున్నాను" అంది.

"వచ్చాను విద్యుల్లతా! నిన్ని దుర్గతినుంచి తప్పించాలని వచ్చాను. ఇదుగోచూడు." అంటూ మహేశబాబు జెబులోనుంచి మందుసీసా పైకి తీశాడు.

"ఏమిటది?" అన్నది విద్యుల్లత.

"ఇది విషానికి విరుగుడుమందు. దీన్ని మనమిద్దరమూ చెరికొంచెం త్రాగివేయాలి."

"ఎందుకు? మీరెందుకు త్రాగాలి?"

"హమేషా ఈగాలి తగలడంవల్ల నాకున్నూ కూడా విషపూరితమై పోయింది."

విద్యుల్లత కళ్లు కన్నీటి కొలనుల్లా మారిపోయాయి.

"ఈమందు త్రాగితే మనం మామూలు మనుషులమై పోవచ్చునా మహేశ్‌బాబుగారూ?"

"అది మనఅదృష్టం."

విద్యుల్లత సీసాను తీసుకుని రెండుగుక్కల మందు త్రాగేసింది.

"ఏమిటది విద్యుల్లతా ! ఏం త్రాగుతున్నావ్ ?" అంటూ డాక్టరుగారక్కడికి వచ్చారు.

"విషానికి విరుగుడు మందునాన్నా ! అన్నది విద్యుల్లత.

డాక్టరుగారు మృత్యువును ముఖాముఖిగా ఎదుర్కొన్న ఆవు అరచినట్టు అరచి నేలపైన కూలిపోయారు. ఆయన ముఖంలో భయం అలముకున్నది.

"ఎందుకండీ భయపడుతున్నారు?" అన్నాడు మహేశబాబు.

"చూడు, ఆమె ఏమైపోతుందో" అన్నారు డాక్టరుగారు.

విద్యుల్లత ముఖం వికృతంగా మారిపోసాగింది. జీవకళ క్రమక్రమంగా అంతరించి పో సాగింది. తల క్రిందికి వ్రాలిపోగా ఆమె శరీరం దబాలున క్రింద పడిపోయింది.

డాక్టరుగారు తలబాదుకుంటూ ఇంట్లోకి వెళ్ళిపోయారు! అంతే ! ఆ తరువాత బయటికి రాలేదు.

మహేశబాబు కలకత్తానగరాన్ని విడిచిపెట్టి ఎక్కడికో వెళ్ళిపోయాడు.

పేరెన్నికగన్న వైద్యశిఖామణు లెందరో విద్యు ల్లత మరణానికి కారణాల్ని పరిశోధించారు. "విద్యు ల్లత ఆరోజున సేవించిన మందు నిశ్చయంగా అమృ తంలాంటిదే! ఐతే శరీరమంతా విషమైన ఆమెకు ఆఅమృతమే విషంలాంటిది. మిగతా మానవులందరికీ ఏది అమృతమో అదే ఆమెకు విషం! అందుచేతనే ఆమె చనిపోయింది." కడపట వాళ్ళందరూ ఈ నిర్ణ యానికి వచ్చారు.

నందనవనంగా పేరుమోసిన ఆ పూలతోట కాలక్రమాన ఎండిపోయింది. పూలచెట్లకు బదులు అక్కడ ముళ్ళచెట్లు బలిసిపోయాయి. డాక్టరుగారి సౌధం పాడుబడిపోయింది.

ఈ కథ జరిగి దాదాపు నూరేండ్లయింది.

(ఆధారం : నెథాని యల్ హాథారన్)



"ఐనా యిదేం చిత్రంరా వెంకన్నా! ఒక రోజూ, రెండురోజులా! పదిరోజులుగా యిదే మామూలైతే యింక ఆట కెవరొస్తారు?" అంటూ నిట్టూర్చాడు తిమ్మప్పనాయడు.

"ఆ చింత నీ కెందుకు దొరా! మెలికల్లాంటి మనుషులిద్దరు నాకు చేదోడుగా వుండాలంతే! రేప

పాటికి ఆ దొంగ వెధవని నీ పాదాలదగ్గర పడేయనూ!"
అని మీసంపైకి చేయి పోనిచ్చాడు వెంకన్న.

"ఏమో! నాకు నమ్మకం లేదురా! ఎందుకూ అను. ప్రతిరాత్రీ దొంగతనం జరుగుతోంది. ఒకరోజు మెడలో చైనుపోతే, మరోరోజు జేబులో డబ్బు పోతోంది. రాత్రే ఏం జరిగిందో చూడు! ఆ పదేళ్ళ అమ్మాయి జనాన్ని విడిచిపెట్టి ఆ చింత చెట్టు మరుగుకు పోయిందంతేకదూ! ఎక్కడున్నాడో ఆ గజ దొంగ ఆ పిల్ల నోట్లో గుడ్డలుకుక్కి నగలు తీసుకుని మాయమయ్యాడు. వాడెవ్వడోగానీ కన్నులలా వుండ గానే కనుపాపను కత్తిరించే మాయలమారీచుడులా వున్నాడు."

"ఆ మారీచుడి పాలిటికి నేను రామబాణాన్ని, దొరా! అంతెందుకు? ఈ రాత్రికి చూచుకో వీడి తడాఖా! పదిరోజులుగా నేను లేకపోబట్టి ఆ దొంగ వెధవ ఆడింది ఆటగా చలామణి అయింది. ఇంక అలా కానిస్తే నాకు మారుపేరు పెట్టు" అన్నాడు వెంకన్న.

తిమ్మప్పనాయుడు కొంతసేపు ఆలోచించి తర్వాత వెంకన్నకేసి చూస్తూ "ఐతే కానీరా వెంకన్నా! రంగణ్ణి, రాముణ్ణి నీ దగ్గరుంచుకో. రాత్రికి కళ్ళల్లో

ఒత్తులేసుకుని కాపలాగాయ్. దొంగను గనుక పట్టుకున్నావంటే నీకు యాభై రూపాయలు యిస్తాం' అన్నాడు.

నాటకాలకూ, తిమ్మప్పనాయడికి తెగని లంకె. చుట్టుపట్ల పది మైళ్ళ దూరంలో ఆట జరుగుతోందంటే అక్కడ తిమ్మప్పనాయడు హాజరై వుంటాడన్న మాట! అసలుచిన్నతనంలో నాయుడే ముఖానికి అద్దలం పూసుకుని చేత కర్రకత్తితో, భుజాలకు భుజకీర్తులతో తలపైన కిరీటంతో, నకిలీ పూసల 'తారాహారాలు' చాకలి తిప్పయ్య కాగడా వెలుగులో ధగద్ధగాయమానంగా మెరసిపోతుండగా శశిరేఖా పరిణయంలో ఘటోత్కచుడి వేషం వేసేవాడు! విరాటపర్వంలో భీముడి వేషం వేసేవాడు. ఇక మైరావణ నాటకంలోనైతే సరే సరి. సాక్షాత్తు పవమానపుత్రుడి వేషం! ఆ వేషానికే తిమ్మప్పనాయుడు పుట్టాడనుకునేవారు ప్రేక్షకులు.

తిమ్మప్పనాయుడికి వయసు మళ్ళింది. ఆ జవసత్వాలు, ఆ చలాకీ తనం, ఆ కంఠధ్వనీ లన్నీ కాలక్రమాన సన్నగిల్లిపోయాయి! ఐతే నాటకాలమీద మోజుమాత్రం అతడిలో నానాటికి పెరిగిందే కానీ తగ్గలేదు. పట్నవాసం డ్రామాకో, సినిమాకో తీసుకెళ్ళు. అంతాచూసి అతడు 'ఐనా యిదేం చోద్దెంరా నాయనా!

ఒక్కపాటయినా యిందులో పైమెట్టందుకుందా! ఏవో చప్పిడి పాటలు, అర్థంకాని మాటలు. అబ్బే ఇలాంటి వెన్నయితే మన ఆటతో సరిపోతుందిరా!' అంటాడు. తిమ్మప్పనాయడి దృష్టిలో దుమ్ము పైకిలేచేట్టు అర గంటసేపు నేలపైన అడుగు ద్రొక్కితేనే అది అభి నయం! దూరాన కొండ గుహల్లోనుంచీ ప్రతిధ్వని విన వచ్చేలా ఒక గడియసేపు రాగం తీస్తేనే అది పాట!

ఎండాకాలం జరుగుతోంది. ఇళ్ళల్లో పడుకుంటే నిద్రపట్టని కాలం. తిమ్మప్ప నాయుడు కంగుందికి కబురు పంపి ఒక 'నాటకపార్టీ'ని రప్పించాడు. సగం డబ్బుమాత్రం చందాలరూపంగా వసూలు చేసి మిగతా సగం డబ్బు తనే వేసుకున్నాడు. ఏకటాకీన పద్దెనిమిది రోజులు భారత నాటకం జరుగుతుందని పరగణా అంతటా టాంటాం వేయించాడు.

అంతా బాగానే వుందిగానీ మంచి పసందైన వీణాగానంలో హఠాత్తుగ ఒక చోట అపస్వరం పుట్టినట్టు, ఆట మొదలైన రాత్రే ఒకచోరీ జరిగింది. దాన్నెవరూ అంతగా పట్టించుకోలేదు. మరునాటి రాత్రి మళ్ళీ ఒక దొంగతనం జరిగింది. గగ్గోలుపుట్టింది. అందరూ కాస్త జాగ్రత్తపడ్డారు. కానీ మూడోనాటి రాత్రికూడా ఒకకాపు పడుచు మెడలో బంగారు గొలుసు

మాయమైంది. ఆ తరువాత ప్రతిరాత్రీ దొంగతనం జరగడం ఒక ఆనవాయితీ అయిపోయింది.

రంగస్థలాని కెదురుగా ధర్మరాజుల గుడి ముందు పందిరిక్రింద కూచున్నాడు వెంకన్న. అతడి అనుచరు లిద్దరూ పడమరవైపుగా ఒకడు, తూర్పు వైపుగా ఒకడు చింత చెట్లక్రింద కూచున్నారు. రాత్రి రెండు జాములు గడిచిపోయాయి. ఆట మంచి రస కందాయంలో వుంది. దుశ్శాసనుడు ద్రౌపదిని సభకు రమ్మనమని బలాత్కరించే ఘట్టం. ప్రేక్షకులు ఒళ్ళు మరచి ఆట చూస్తున్నారు.

వెంకన్న లేచి నిల్చున్నాడు. మెల్లగా రంగడి దగ్గరికి వచ్చాడు.

"ఈ రాత్రికిక దొంగతనం జరగదు వెంకన్నా! ఆ దొంగగాడికి మనం కాపలా వున్న విషయం తెలిసి పోయిందల్లే వుంది" అన్నాడు రంగడు.

"తొందరపడకు. ఇంకా కాసేపు చూద్దాం" అన్నాడు వెంకన్న.

ద్రౌపది తల వెంట్రుకలను పట్టి దుశ్శాసనుడు కొలువుకు లాక్కుపోతున్న వేళకు సరిగ్గా సభలో ఎక్కడో ఎవరో 'పాము పాము' అని అరిచారు.

ప్రేక్షకులందరూ పైకి లేచేశారు. అటూ, ఇటూ పరుగెత్తారు. అంతవరకూ నిద్రపోతున్న బిడ్డలు వులికిపడి గొంతు చించుకోసాగేరు.

ఆ గందరగోళంలో ఒక ముసలికాపు మెడలో బంగారపుకంటె మాయమైపోయింది. అతడు లబో దిబోమని మొత్తుకోసాగేడు.



వెంకన్నవి పిల్లికళ్ళు, అతడు నిల్చున్న చోటు నుంచి కదలకుండా దూరంనుంచే ఈ దృశ్యాన్ని చూడ

సాగాడు. పాముపామని అరిచిన వ్యక్తిని అతడు ముమ్మందుగా గుర్తుపట్టి వాడిపైనే తనదృష్టి కేంద్రీకరించాడు.

"ఇంకా. యిక్కడ నిల్చున్నావేం వెంకన్నా! జనంలోకి పోదాం పద" అన్నాడు రంగడు;

"ఉండుండు దొంగ దొరికిపోతున్నాడు" అన్నాడు వెంకన్న.

పదినిమిషాలు గడచిన తర్వాత పాము పామని గగ్గోలు లేపిన మనిషి మెల్లగా జనాన్ని తోసుకుని ఈవలికి వచ్చాడు. ఎవరైనా తనని అనుమానిస్తున్నారేమోనని నలువైపులా కలయచూచాడు.

వెంకన్న కప్పటికే అతడే దొంగని గట్టి నమ్మకం దొరకలేదు. అతడొక చిన్న చిట్కా ప్రయోగింపదలచి "అదిగో. వాడేదొంగ! పట్టుకోండి" అని అరిచాడు.

దొంగ ఎగిరి దూకాడు! క్రిందమీదు తెలియకుండా పొలాల్లోపడి పరుగెత్త సాగేడు!

వెంకన్న శరవేగంగా దొంగని వెంటాడ సాగేడు. రంగడు, రాముడు అతణ్ణి వెంబడించారు.

కానీ దొంగవెధవ లేడిపిల్లలా పరుగెత్తు తున్నాడు. ఐదడుగుల పొడవు, చింతబరికె లాంటి తెలికైన శరీరం! అసలు వాడు పరుగెత్తడమేలేదు, ఎగిరెగిరి బారలకు బారలే దాటిపోతున్నాడు.

వెంకన్న పరుగెత్తుతూనే ఆలోచించాడు. ఇలా వెన్నంటి దొంగని చేజిక్కించుకోడం అతడికి అసాధ్యమనిపించింది. అతడున్నట్టుండి ఆగి "ఒరే రంగడూ! వద్దు వద్దు. పైకి గురెట్టకు. మోకాళ్ళ క్రింద కాల్చు. ఊఁ కానియ్యిమరి! ఒక్క వేటుచాలు" అని కేకవేశాడు.

అందుకు తగ్గట్టు రంగడు చేతనున్న దుడ్డుకర్రను ముందుకు చాపి "అయిపోయిం దయిపోయింది. వెంకన్నా! వారలకు తప్పుకో! కాల్చేస్తున్నాను" అని కేకవేశాడు!

కాళ్ళకు సంకెళ్ళు పడ్డవాడిలా దొంగ హఠాత్తుగా ఆగిపోయాడు. రంగడు, రాముడు ఒక్కుమ్మడిగా పైనబడి పెడరెక్కలు విడివికట్టి వాడిని వెంకన్న ముందు పడేశారు!





హాలంతా జనంతో క్రిక్కిరిసిపోయింది. పైన పంకాలు గిర్రున తిరుగుతున్నాయి. ఐనా బయట వడ గాలి యింకా వీస్తున్నందువల్ల, లోపల కూల్‌డ్రింక్స్ అమ్ముడు బోతున్నాయి. ఆరుగంటలకింక పదిహేను నిమిషాలకన్నా వ్యవధిలేదు. అప్పుడే నేలటిక్కెట్లలో నుంచి ఈలలు ఎడతెగకుండా సాగిపోతున్నాయి.

అక్కడేదో నాటకమో, సినిమావో ప్రారంభం కాబోతోందను కుంటున్నారుకదూ! కాదు. మావూళ్లో అలాటి సామాన్యమైన సంఘటనలకు ముందు యింత సంరంభము జరగదు.

మరిప్పుడేం జరగబోతోంది? తొందరపడతా రెందుకూ! అదే చెప్పబోతున్నాను.

మీరు వినేవుంటారు ప్రొఫెసర్ కాంతిరాజు గారిని గురించి ఆయనగారు ఏ కాలేజీలో ప్రొఫెసరో నాకు తెలియదు. ఆయన ఇంద్రజాల మహేంద్రజాల గజకర్ణ గోకర్ణ టక్కుటమారా విద్యల్లో ఆరితేరిన వాడనీ అందరూ చెప్పుకోడంమాత్రం ఎరుగుదును. మరి ఆయన్ను గురించి ఆమధ్య పత్రికల్లో కూడా ఎన్నో అద్భుతమయిన వార్తలు వచ్చాయంటాడు మా అన్నయ్య! ఒరే అన్నాయ్! ఎన్నోఅద్భుత వార్తలు వచ్చాయంటున్నావుకదా ఒకటి చెప్పారా పోనీ అని ప్రాధేయపడ్డాను.

అన్నయ్య చెప్పాడు. మావాడు మోకాలెత్తు విడిచిపెట్టి పైపైన్నే జంబు కోసేవాడని మావూళ్లో ఒకప్రతీతి వుంది. ఉంటే వుండనివ్వండి! నిజము దేవుడెరుగు. నీరు పల్లమెరుగు! నేను మాత్రం

అన్నయ్య చెప్పిన కథ మీకు యధాతధంగా చెప్పేస్తున్నాను.

ఒకసారి ప్రొఫెసరు కాంతిరాజుగారు ఒక ప్రత్యేకాహ్వానం పురస్కరించుకుని ఇంగ్లండుదేశం వెళ్లారు. వెళ్ళి లండన్ నగరంలో వరుసగా ఒక నెల రోజులపాటు ప్రదర్శన లిచ్చారు! అది ఆఖరురోజు. మామూలు మేరకు ఆరోజుకూడా సాయంత్రం ఆరు గంటలకల్లా ప్రదర్శనం ప్రారంభం కాగలదని కరపత్రాల్లో ప్రకటించారు. ఆ అపూర్వావకాశాన్ని జారవిడుచుకోడానికి మనస్కరించక మంత్రులు, అసెంబ్లీ సభ్యులు, యింకా పురప్రముఖులు చాలామంది ప్రదర్శనానికి విచ్చేశారు. దగ్గరున్న చర్చిలో గంట ఆరుసార్లు టంగుటంగున మ్రోగింది. ఆగంటతోబాటు లేవవలసిన తెరమాత్రం కదల్లేదు. మెదల్లేదు. ఆరుకుపైన ఐదునిమిషాలు గడచిపోయాయి. ఆరు, ఏడు, ఎనిమిది పదిహేను, చివరకు యిరవై నిమిషాలుకూడా గడచిపోయాయి. ఇక్కడ అన్నయ్య మాటల్నే వుదహరించడం మంచిది. పంక్చుయాలిటీ అంటే అది యింగ్లీషువాళ్ళ సొమ్ము! వాళ్ళు వురిపోసుకుని చావటానికైనా సమ్మతిస్తారుకానీ కార్యక్రమంలో ఒక నిమిషం ఆసల్యం జరగడానికి సమ్మతించరు. ఇప్పు

డైన ఆలస్యం ఒకటిరెండు నిమిషాలేమీ కాదు. నిండుగా యిరవై నిమిషాలు. అనేక కార్యక్రమాలను వాయిదా వేసుకుని ప్రదర్శనానికి వచ్చినవాళ్ళ కందరికీ పట్టరానంత కోపం వచ్చింది. అసెంబ్లీసభ్యులు కొం దరు చిరాకుతో లేచి వెళ్ళిపోవాలనికూడా అనుకున్నారు.

ఇక్కడ నాబుర్రలో ఒక ఆలోచన మెరసింది! అంతంత గొప్పవాళ్ళ ఎదుట తన యింద్రజాలం ప్రద ర్శించడానికి భయపడి ఒకవేళ ప్రొఫెసరు కాంతిరాజు గారు కాలికి బుద్ధిచెప్పేశారేమో!

అన్నయ్య మాత్రం కథ చెప్పుకపోతున్నాడు. ఎలాగైతేనేం, ఆఖరుకు ఆరున్నరకు ఐదు నిమిషా లుండనగా తెరలేచింది. ప్రొఫెసర్ కాంతిరాజు సభకు చేతులు జోడించి ప్రేక్షకమహాశయులకు నమస్కా రాలు. కారణమేమిటోగాని మీముఖారవిందాలన్నీ ముకుళించుకునిపోయివున్నాయి. తెలిసో, తెలియకనో ఈ యింద్రజాలకు డేమైనా పొఱబాటు చేసివుంటే మీరు మన్నించాలి అన్నాడు.

చాల్లేవోయ్ ఉపోద్ఘాతం! ఐనా ఆలస్యానికి తోడూ యింకొక వుపన్యాసం కూడానా! అని ఒక మంత్రిముఖ్యుడు ఛీత్కరించుకున్నాడు.

ఏమిటి ! ఏమన్నారు ? ఆలస్యమయిందా ? అని అతి వినయంగా ప్రశ్నించాడు ప్రొఫెసర్ కాంతిరాజు.

ఓరి నీ పాతకంకూలా ! ధాదాపు అరగంట ఆలస్యమయిందయ్యా బాబూ ! అన్నాడు మొదటి వరుసలోకూర్చున్న యార్కు ప్రభువు :

బాబ్బాబూ ! మీరందరూ పొఅబడినట్టున్నారు. అప్పటికీ నేను తొందరపడి యింకా ఆరుకు రెండు నిమిషాలుండగానే తెర పైకెత్తమన్నాను. తొలి పలు కులకు రెండు నిమిషాలు పోనూ యిప్పుడు సరిగ్గా ఆరుగంటలై వుండాలి అన్నాడు అమాయక ముఖంతో కాంతిరాజు!

నాన్సెన్స్ నువ్వొక్కసారిగా మమ్మల్నందర్నీ ఫూల్స్ చేయాలనుకుంటే అదెలా కుదురుతుంది ! అన్న దాక కంఠం సభలోనుంచీ.

ఎందుకైనా మంచిదని అప్పుడొక ప్రేక్షకుడు కోటు చేతిని పైకితీసి రిష్టువాచీకేసి చూచుకుని ఆశ్చర్యం ! ఆశ్చర్యం ! డియర్ ఫ్రెండ్స్ ! ఇప్పుడు సరిగ్గా ఆరే అయింది అన్నాడు.

ప్రేక్షకులందరూ వులికిపడి గడియారాలు చూచు కున్నారు, అన్నిగడియారాల్లోనూ గంట ఆరే !

ప్రొఫెసర్ కాంతిరాజు విజయగర్వంతో చిరు నవ్వు ఒలకబోసి నాకార్యక్రమంలో మొదటి అయిటం కాలచక్రాన్ని వెనక్కి త్రిప్పడం. అది జయప్రదంగా నెరవేరిందనుకుంటాను అన్నాడు.

తన యింద్రజాల విద్యతో పాశ్చాత్యుల్నే విస్మయచకితులుగాజేసిన ప్రొఫెసరు కాంతిరాజుగారు మనవూరికి రావడం నిజంగా మన అదృష్టం! అన్నాడు అన్నయ్య కథ ముగిస్తూ.

అలాటి కాంతిరాజుగారి ప్రదర్శనం చూడ్డానికి వచ్చిన ప్రేక్షకులతో మావూరిహాలు కిటకిటలాడి పోతుండడంలో ఆశ్చర్య మేముంది? మాలోనూ కొందరు చేతిగడియారాలు చూచుకోసాగేరు! కొంద రేమో వేడిగా నిట్టూర్చుకుంటూ చేతి గుడ్డలతో ముఖం తుడుచుకున్నారు. ఈలలు మరీ విజృంభించిపోయి వాటితో హాలు ప్రతిధ్వనించి పోసాగింది. ఇంత హంగామా జరిగినతర్వాత తెరమెల్లగా పైకి కదిలింది.

కానీ ప్రొఫెసరు కాంతిరాజుగారి ప్రదర్శనం చూచినతర్వాత నా కాయనదేమంత గొప్ప ఇంద్ర జాలంగా తోచలేదు. ఆపాటి యింద్రజాలానికి ప్రొఫె సరు కాంతిరాజుగారే అవసరంలేదు! మావూరి బసు

స్టాండులో చింతచెట్టుకింద పాముల్ని ఆడించుకునే వాడింతకన్నా మంచి తమాషాలు చేసి చూపెడుతాడు.

ఐనా ప్రేక్షకులందరూ నా అభిప్రాయంతో ఏకీభవించారని చెప్పడానికి వీల్లేదు. వాళ్ళకు ప్రొఫెసరు గారి కనుకట్టు విద్యల్లో ఏం క్రొత్తకనబడిందో నాకు తెలియదు. ఆయన గ్లాసుముక్కలు నమిలి తినేస్తుండగా వీళ్ళు ఆనందాతిరేకంతో చప్పట్లు చరిచారు. ఆయన కళ్ళుమూసుకుని ప్రేక్షకులు చూపించిన వస్తువులేమిటో చెప్పినప్పుడు వీళ్ళు హర్షసంభ్రమాలతో వివశులై పోయారు. ఆయనగారు యాభై గజాల రిబ్బను మింగి దాన్ని బయటికి పూడలాగుతున్నప్పుడైతే సరేసరి! ప్రతిప్రేక్షకుడూ అమందానందంతో ప్రక్కన కూచున్న ప్రేక్షకుడి వీపు చితకబాదేశాడు! (ఇక్కడ నా వీపుకుసైతం సానుభూతి.)

కార్యక్రమం ప్రకారం ప్రదర్శనంలో కడపటిది మిమిక్రి ప్రొఫెసరుగారు గాడిదలా ఓండ్రపెట్టడంతో ప్రారంభించారు. తరువాత గుర్రంలా సకిలించారు. ఏనుగులా ఘీంకారం చేశారు. కానీ అవన్నీ ఒకఎత్తు! ఆయన కుక్కలా అరిచిందిమాత్రం ఒక ఎత్తు!

కుక్కలా అరవడంతో ప్రదర్శనం (మంగళ గీతంతో కాదుగదా!) సమాప్తమయింది! అబ్బ! అచ్చం కుక్కలా అరిచాడురా అని ఒకరంటే అసలు కుక్కయినా అంత బాగా అరవదు. అందుకు నాది పూచీ! అని మరొకరంటూ ప్రేక్షకులందరూ యిల్లు చేరుకున్నారు.

ఇంతటితో ప్రొఫెసరు కాంతిరాజుగారి కథ పూర్తికావలసిందే కాని మా రవణయ్య ఎందు కూరు కుంటాడు! "కాంతిరాజుగారికంటే బాగా అరవగలిగిన వాళ్ళు మన వూళ్ళోసైతం లేకపోలేదు. వినదలచుకున్న వాళ్ళందరూ సాయంత్రం సంత మైదానం దగ్గరికి రావచ్చు" అని వీధుల్లో టాంటాం వేయించాడు.

టిక్కెట్టులేని ప్రదర్శనం కావడంవల్లనేమో సంత మైదానం సాయంత్రానికల్లా జనంతో నిండి పోయింది? ప్రేక్షకుల ముందు ఓ బండరాయిపైన నిల బడి మా రవణయ్య "ఊరుకోం డూరుకోండి! ప్రద ర్శనం ప్రారంభం చేస్తున్నాను. మొదట మీ అభిమాన తిర్యగ్జంతువు గాడిదలా అరవడానికి ప్రయత్నిస్తాను" అని తను నేర్చినవిధంగా ఓండ్రుపెట్టాడు.

ప్రేక్షకులు ఒకరిముఖం ఒకరు చూచుకున్నారు. కాని ఎందుచేతనో ఎవరికీ తృప్తికలిగినట్లు కనిపించ లేదు.

రవణయ్యకు నిరుత్సాహం కలిగింది. ఈసారి గుర్రంలా సకిలిస్తాను అంటూ ప్రారంభించాడు. ప్రేక్షకులు హేళన వ్యక్తం చేయడానికి కాబోలు, గొల్లున నవ్వేశారు. కొందరు షేమ్ షేమ్ అని అరవను కూడా అరిచారు.

రవణయ్య ధైర్యం కూడదీసుకుని ప్రేక్షక మహాజనులారా! మీరు కొంతసేపు ఊరుకుంటే నేను కుక్కలా అరుస్తాను అన్నాడు.

ఏడ్చింది చాల్లేవోయ్! గాడిదనీ, గుర్రమనీ నోటికొచ్చినట్లల్లా కూసింది చాలక ఇంక కుక్క కూడానా! అంటూ ఒకవృద్ధుడు వెనుదిరిగి వెళ్ళబోయాడు.

శాంతించండి! శాంతించండి! కుక్కలా అరవడంలో నాకు నేనేసాటి అని నా దృఢనమ్మకం! దయవుంచి ఒక్కసారి వింటే మీకే తెలుస్తుంది అంటూ రవణయ్య ఏకటాకీన కుక్కలా అరవసాగాడు!

ఏంకుక్కది! మనకుక్క అరుపులా విని పించడంలేదే అన్నారొకరు.

ఒకవేళ అది సీమకుక్క అరుపేమో! అన్నారు మరొకరు.

ఐనా ఈ రవణయ్యకేం పోగాలంరా! పులిని చూచి నక్క వాతలువేసుకున్నట్లు! అని యింకొకరు రవణయ్యపట్ల జాలిపడ్డాడు.

అరచి అరచీ రవణయ్య అలసిపోయాడు. నిరాశతోనూ, రాచిన గొంతుకతోనూ అతడు సోదరులారా! కుక్కలా అరవడంలో కూడా నేను ప్రొఫెసరు గారికి సాటికాలేక పోయానుకదూ! అన్నాడు.

నక్క ఎక్కడ! నాగలోక మెక్కడ! అని ఎవరో జనంలోనుంచి అరిచాడు.

ఔనౌను అంటూ రవణయ్య తను తొడుక్కున్న పొడుగాటి కోటు జేబులోనుంచీ ఒక దేశవాళీ కుక్కపిల్లను పైకితీసి ఇంతవరకూ మీరు చిన్న కుక్క అరుపు నానోటినుంచీ వచ్చిందికాదు, నేను పూరికే నోరు తెరిచాను. నాకు ప్లేబాకుగా ఈ కుక్క పిల్ల అరిచింది! అరవడానికని దాన్ని మెల్లగా గిల్లి పెట్టాననుకోండి! అది వేరే సంగతి. కానీ ఏంలాభం!



నిజమయిన కుక్కపిల్ల గూడా ప్రొఫెసర్ కాంతిరాజు గారీలా అరవలేక పోయిందికదా! అంటూ కుక్కపిల్లని క్రిందికి విసరి చేతులూపుకుంటూ అక్కడి నుంచీ వెళ్ళిపోసాగేడు.

ప్రేక్షకులముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్క లేదని నేను ప్రత్యేకించి చెప్పవలసిన అవసరం లేదు!



“ఆద్రొకకాలం! వెర్రికాలం!”

వెర్రేమిటి! కాలమేమిటి! అని చాలమందికి ఆశ్చర్యం కలగవచ్చు. అసలు నేనుకూడా మా నరసయ్య మామ నోటినుండా ఆమాటలు విన్నప్పుడు విస్తుపోయినమాట వాస్తవం!

“అదేమిటి మామయ్యా! : చరిత్రలోనైతే హిందూ యుగమనీ మహమ్మదీయ యుగమనీ

యేవో వున్నాయని విన్నాను. కానీ నీ వెఱ్ఱికాలం సంగతి నేనెప్పుడూ వినలేదే!" అన్నాను.

నా సందేహానికి సమాధానంగా వెఱ్ఱికాలమేదో వుదహరించి నరసయ్యమామ అందుకు కారణాల్ని గూడా విపులీకరించి చెప్పాడు.

ధాత కరువులోనట మా నరసయ్యమామకు నూనూగు మీసాలు వస్తూవస్తూ వున్నాయట! కరువు, కరువు అన్న మాటేగానీ అప్పుడు రూపాయకు పన్నెండుపళ్ల రంగూను నూక దొరికేదట! అప్పటి మా ప్రాంతంలో రైళ్లూ, బస్సులు లేకపోవడంవల్ల మా నరసయ్యమామ గిత్తల్ని కొనుక్కురావడానికి పలమనేరు పశువుల వరసకు నడిచివెళ్ళేవాడట! ఎక్కడో మావూరికి ఆమడదూరంలో వున్న మల్లేశ్వరుడి కోనలోనుంచి ఆరు మూరల పొడుగున్న ఏగిదూలాన్ని తనొక్కడే భుజంమీద మోసితెచ్చి యింటి దగ్గర దింపేసేవాడట!

ఆ ఏగిదూలాన్ని ఈరోజుల్లో ఏ యువకుడైనా ఎత్తి భుజంమీద పెట్టుకుంటే తన బానిసీ . పొలాన్నీ వాడికి విక్రయం చేస్తానంటూ సవాలు విసురుతాడు నరసయ్యమామ.

అతడి బావినీ, పొలాన్నీ ఆశించి గాకపోయినా ఈ తరంవారి ప్రతిష్ఠను నిలబెట్టడానికైనా కొందరు వస్తాదులు ముందుకు రావచ్చుగదా! ఊహు రారే!

"మీ వల్ల నేమౌతుందిరా బాబూ! అదొక కాలం! వెర్రికాలం! చింతకాయ తొక్కులు నంజు కుంటూ ఒక దుత్తెడు అంబలి మజ్జిగతో కలిపి త్రాగి పార చేతబట్టి పొలంలో వంగితే మళ్లీ మధ్యాహ్నానికే తల పైకెత్తేవాళ్ళం. బండిలో నాలుగు గోనెల బెల్లం వేసి సునాయాసంగా చక్రంతీసి నొగను పైకెత్తి కందెన వేసుకునేవాళ్ళం. ఇప్పుడా తిండిలేదు. పనీలేదు."

మా నరసయ్యమామ భోజన ప్రియుడు. గ్రుక్కెడు కాఫీనీళ్ళతో మధ్యాహ్నందాకా వూపిరి బిగ బట్టుకోగల నాగరికులకు అతడి భోజనప్రియత్వం అర్థంగాదు. ఐనా నరసయ్యమామ యిప్పుడేం తింటు న్నాడు గనుక! అతడి భోజనసౌఖ్యం నాగమ్మత్తతోనే పోయింది. చచ్చి స్వర్గంలోవుంది ఆ యిల్లాలు! తన భర్త కేపదార్థం రుచో. ఏ ఏ కాలంలో అతడు ఏదేది తినాలని వాంఛిస్తాడో ఆవిడకు తెలుసు. ఈ కోడళ్ళకేం తెలుసు; వాళ్ళు పల్లే పట్నమూగాని పేటకొంపలనుంచీ

చదువూ గిదువూ కొంత ఒంట బట్టించుకొని నరసయ్యా కాపురానికి దిగుమతయ్యారు. వాళ్ల కెంతసేపూ కాఫీలు, పెసరట్లలాంటి పిట్టమేతల గొడవేగానీ మామ గారి భోజనం సంగతి ఏంపట్టింది! వాళ్ళ ధోరణి గమ నించి నరసయ్యమామ కూడా తన కదీ, యిదీ తినా లనుందని కోడళ్ళకు పురమాయించడం మాను కున్నాడు. లేదంటే ఆ వెర్రికాలంతో తనకు నాగమ్మ చేసిపెట్టిన వంటకాల్ని తలచుకుంటూ సంతృప్తి పడుతుంటాడు.

మొన్ననే గడచిపోయిందిగదూ ధనుర్మాసం. ఆ ధనుర్మాసాన్నే నరసయ్యమామ పండుగనెల అంటాడు. ఆ పండుగనెలలో ఒక తమాషా జరిగింది.

ధనుర్మాసం ప్రారంభం కాగానే నరసయ్య మామ కోడళ్ళిద్దరూ తెల్లవారు ఝామున్నే స్నానాలు చేసి పూజా పునస్కారాలు చేయసాగేరు. ఎక్కడా లేనంత భక్తి వాళ్ళకా నెలమొదలు కావడంతోటే కలిగింది!

ఎవరిభక్తి వాళ్ళది. వాళ్ళభక్తితో నరసయ్య మామకు ప్రశక్తిలేదు. కానీ ఆనెల పొడుగునా యింట్లో శాకాహార నియమం పాటించబడాలంటే ఎలాగ?

చిక్కంతా అక్కడే వచ్చింది మా నరసయ్యమామకు.

పండుగ నెల రావోతోందనగా నరసయ్య మామ కాయిలా పడి లేచాడు. ఇక బ్రతకడనే అను కున్నారు. బ్రతికాడు. కానీ మనిషి మాత్రం బాగా చిక్కి పోయాడు. ఐనా అతడు వీధంట నడుస్తుంటే మా కందరికీ చచ్చినవాడొకడు మళ్లీ బ్రతికి వచ్చినంత సంబరం కలిగింది.

కాయుతాను మంచీ చేయకోగానే నరసయ్యమామ పెద్దకొడుకును పిలిచి "ఒరే బాబూ! రోతకు పెట్ట కోడి ఏదైనా వుందేమో చూడు" అన్నాడు.

కొడుకు నేరుగా భార్య దగ్గరికి వెళ్ళి "చూడూ! మా నాన్నగారికి నాలుక చవి చెడిపోయినట్టుంది. కోడి పెట్ట వుందేమో చూడమంటున్నాడు" అన్నాడు.

రత్నమ్మ మండిపడింది. "పండుగ నెలలో కూడా ఆ పాపిష్టిపని చేయకపోతే ఏమండీ! ఈ నెల రోజులు కాస్తపూరుకోమనండి! పసలపండుగ నాటికి ఎలాగ వుండనేవుందిగదా!"

ఆ మాటలు నరసయ్య మామ చెవులదాకా వచ్చాయి. అతడు వేడిగా నిట్టూర్చి మెల్లగా బయటికి వెళ్లిపోయాడు.

ఊతకర్ర సాయంతో నెమ్మదిగా నడుస్తూ నరసయ్యమామ ఏరువాటి మామిడితోపు వైపు దారి తీశాడు. నాగమ్మ త్త పోయినతరువాత అతడు మామిడి తోటలో స్వయంగా తను వేసుకున్న గుడిసెలోనే ఎక్కువకాలం గడిపి వేస్తున్నాడు. తోటలో అక్కడక్కడా టెంకాయచెట్లుగూడా వున్నాయి. ఈమధ్య దొంగతనాలు ముదిరిపోయి, రేయింబవళ్లు కాపుండక పోతే టెంకాయలు వంబాలకు వంబాలే మాయమై పోతుండడంవల్ల నరసయ్యమామ పాలేరు రాముడితో పాటు రాత్రుల్లో గుడిసెలో పడుకుంటాడు. నిద్రవస్తే నిద్రపోతాడు. లేకుంటే పదాలు పాడుకుంటాడు.

మూతి ముడుచుకుని గుడిసె ముందరున్న మంచంపైన కూలబడిన నరసయ్యమామను చూచి ప్రక్కనే నేరేడుచెట్టుక్రిందకి నీరు బావిలో కబెళె తోలుకుంటున్న రాముడు "ఏం బాబయ్యా! అలా వున్నావు" అని అడిగాడు.

"ఏంలేమురా! కాయలాపడి లేవానా! నాలుక కొయ్యలా గిడస బారిపోయింది. ఏది తినబోయినా సహించడం లేదు" అన్నాడు నరసయ్యమామ.

"కారం తగిలించరాదూ మరి!" అన్నాడు రాముడు. బానను బావిలో [illegible]క వేయిస్తూ.

"మన మాటేం సాగుతుంది రాముడూ! అదేదో పండుగనెలట్నే, పండుగనెల! ఈ నెల రోజులూ ఒకప్రొద్దుండాలట! ఇంట్లో ఆవాసనే తగల గూడదంటోంది కోడలు."

రాముడు ఎద్దుల్ని బారిలో నిలబెట్టి గుడిసె దగ్గరికి వచ్చి "చూడు బాబయ్యా! నేనొకటంటాను. నువ్వు మారుచెప్పగూడదు" అన్నాడు.

"ఏమిట్రా అది" అన్నాడు నరసయ్యమామ.

రాముడు కొంతసేపు ఆలోచించి "ఊఁహు నేను చెప్పను. చెబుతే నువ్వు ససేమిరా ఒప్పుకోవు. రాత్రికి నీకే తెలుస్తుందిగా" అంటూ మళ్ళీ బావిదగ్గరికి వెళ్ళిపోయాడు.

ఆరోజు రాత్రి.

తొలిఝాము గడిచిపోయి మలిఝాము ప్రారంభ మౌతుండగా రాముడు గుడిసెలోపలికి వచ్చాడు. పొగాకు నముల్తూఏదోకీర్తన పాడుకుంటున్న నరసయ్య మామ"ఏంరా రాముడూ! ఇప్పుడొస్తున్నావు" అన్నాడు.

"ఊరికే వస్తున్నానా, ఎంతపని చేశానని! చూడు" అంటూ రాముడు కప్పుకున్న దుప్పటిలో నుంచి నల్లటి కోడిపెట్టను పైకి తీశాడు.

"అదేంపనిరా బాబూ! ఎక్కడినుంచి తెచ్చావు? ఎవరికైనా తెలిస్తే? ఛా. దొంగతనంచేసి ఎవడు తిన మన్నాడురా మనల్ని? అంతకన్నా చస్తే నయం-కదూ!" అన్నాడు నరసయ్యమామ.

"దొంగతనం చేసిందెవరు బాబయ్యా! నేను! వస్తే ఆ పాపం నాకొస్తుంది. నీకేంభయం: నువ్వా రుకో. కట్టెలు సిద్ధంగా వున్నాయి. కావలసిన వస్తువు లన్నీ సాయంత్రమే యిక్కడికి తెచ్చి వుంచాను. రెండు గడియల్లో కూరొండేస్తాను" అన్నాడు రాముడు.

నరసయ్యమామ ఎంతో చెప్పి చూచాడు. కాని రాముడు తను పట్టిన కుందేటికి మూడే కాళ్ళన్నాడు.

* * *

మరునాటి వుదయం నరసయ్యమామ ముఖం కడుక్కొని యింటికి వచ్చేసరికి కోడళ్ళిద్దరూ పెరట్లో నిలబడి యిరుగు పొరుగు నాలుగైదిళ్ళకు వినబడేట్టు కేకలేస్తున్నారు.

"ఇంతపని చేసిన వాళ్ళు నిద్రబోతున్నప్పుడు గొంతుమీద రాయి వేయరూ! చిన్నదా చిపకదా! గుడ్లు పెట్టే పక్కానికి వచ్చిన కోడిపెట్టే!" అంది పెద్ద కోడలు రత్నమ్మ.



"ఐనా యింత అన్యాయమా! ఎంత పెట్టె! ఎంత పెట్టె! గంపక్రింద మూసిపెట్టాలని ఎత్తుకోబోతే కుడిచేయి క్రిందికి ఒరిగిపోయేదే!" అంది చిన్నకోడలు బంగారు.

"తిననీ, తిననీ! నేను తిడితే శాపం పెట్టినట్టే! పోతారు! నాశనమై...."

రత్నమ్మ మాట పూర్తిగాక ముందే నరసయ్య మామ చరచరా పెరట్లోకి వచ్చి "మహా చూశావులే బంగారుపెట్టె! నోరుమూసుకోండి చాలుగానీ! పట్టి

ఎముకలగూడు! నమిలి నమిలి పండ్లే అరిగిపోయాయి”
అన్నాడు.

రత్నమ్మ బంగారు ముఖం చూచింది. బంగారు రత్నమ్మ ముఖం చూచింది. ఇద్దరూముని పళ్ళతో నాలుకను కొరుక్కుంటూ లోపలి వెళ్ళిపోయారు.






డి. యస్. పి కమలాకరరావుగారు ఉన్నట్టుండి సంధిగ్ధావస్థలో పడిపోయారు. ఆయన ఇంటి నుంచీ పదిగంటలకు ఆఫీసుకు రాగానే, గణగణ మని ఫోను మ్రోగింది. రిసీవరును చె [illegible] ుకుంటూ ఆయన "ఎవరూ?" అని

నెంత నెమ్మదిగా ప్రశ్నించారో, అంతకంగారుగా జవాబు వచ్చింది. "రామవరంలో దొమ్మీ జరుగుతోంది. పంచాయితీబోర్డు ఎలక్షను సందర్భంలో ప్రారంభమయిన చిన్న కలత నేటికి పరిపూర్ణమైన క్లయిమాక్సు అందుకున్నది. ఇరువైపులా రెండువందల మంది కర్రలతో, కటారులతో యుద్ధరంగలో దూకి ఢీకొనబోతున్నారు, అర్జెంట్ అర్జెంట్ వెంటనే రిజర్వు పటాలాన్ని పంపాలి.

ఆదెబ్బతో రావుగారు కాలింగు బెల్‌ను వడివడిగా నొక్కి, పిలుపందుకుని పరుగెత్తి వచ్చిన జవానుతో "డ్రయివరెక్కడున్నాడోచూడు. కారుని నిమిషాల్లో రెడిచేయమను" అన్నారు.

ఐదు నిముషాల్లో ఆఫీసు ముందుకారు ఆగింది. రిజర్వు పటాలాన్ని తన వెనువెంటనే బయలు దేరి రమ్మని ఆనతిచ్చి రావుగారు కారులో కూచుని ఒఘెయిన తలుపు వేసి "టీక్ స్టార్టుచెయ్" అని డ్రయివరును వేగిరించారు. డ్రయివరు కాలితో మరనునొక్కి, చక్రాన్ని త్రిప్పి కారును స్టార్టుచేసి సింహ ద్వారం దగ్గరికి పోయేసరికి "సార్, సార్" అంటూ పోస్టుమేన్ అక్కడికి పరుగెత్తుకొచ్చాడు.

క్యా— —డి. యస్. పి. గారు చిరాకుతో ఆఫీసులో యున్న

కూడదూ!" అన్నారు. "ఒకసారి అలా యిచ్చినందుకు తమరు కోప్పడ్డారండీ! అందుచేత...."అని నసుగుతూ పోస్టుమేన్ వుత్తర మందించాడు. ఆ వుత్తరం కళ్ళబడే సరికి రావుగారు ఒక క్షణంపాటు రిచ్చ పడిపోయారు. అది ఆతురతగా ఆయన ఎదురుచూస్తున్న వుత్తరం. అది రాబోతుందన్న వార్త రెండురోజులకు ముందే ఆయనకు అందింది. ఉత్తరదేశంలో ఎన్నో చోరీలు చేసి, ఫోర్జరీ సంతకాలతో బ్యాంకుల్ని దోచుకున్న గజ దొంగల ముఠా ఒకటి ప్రస్తుతం తన ఏరియాలో మకాం వేసినట్టు, వారి ఆచూకీకి, ఆకారానికి సంబం ధించిన ఆనవాళ్ళతో కొంత రికార్డు తనకు పంపబో తున్నట్టు ఇన్‌స్పెక్టరు జనరల్‌వారి కార్యాలయంలో వున్న ఆత్మీయు డొకడు ఆయనకు ఫోన్‌లో కబురు చేశాడు. ఐతే ఆవుత్తరం అంత తొందరగా తనచేతికి రాగలదని రావుగారు ఊహించలేదు. ఇప్పుడా వుత్త రాన్ని తనతోబాటు క్యాంపుకు తీసుక పోవడమా, లేక ఆఫీసులో ఉంచి వెళ్ళడమా అని ఆలోచిస్తూ ఆయన కొంతసేపు మౌనంగా కూర్చున్నారు.

సరిగ్గా ఆసమయానికి రెండురోజులపాటు సెలవు తీసుకుని కులాసాగా కాలక్షేపం చేయడానికి పట్టణంలోకి వెళ్తున్న సబ్‌యిన్‌స్పెక్టరు శంకరనారా

యణ అలా వెళ్తూవుండి డి. యస్. పి. గారు కారులో ప్రత్యక్షం కాగానే తను సిపిల్ డ్రస్సులోవున్న మాట కూడా మరచిపోయి అటెంషన్‌లో నిలబడి "గుడ్ మార్నింగ్‌సార్" అంటూ సెల్యూట్ చేశాడు. "ఇదిగో శంకరనారాయణా! నీ వినయానికి సంతసించాంగానీ, యిలారా. ఈ ఉత్తరాన్ని తీసుకెళ్ళి...." అని రావు గారు మళ్లీ ఆలోచనలో పడ్డారు.

ప్రమోషన్ కోసం కలలుకంటూ, అధికారి అనుగ్రహంకోసం అర్రులు చాస్తున్న శంకరనారాయణ వినమ్రంగా చేతులు కట్టుకుని "పోస్టుచేయ మంటారా సార్" అన్నాడు.

"అంతే, అంతే. నీదెప్పుడూ కొంపముంచే మాటమయ్యా, శంకరనారాయణా! ఇదిప్పుడే పోస్టు మెన్ తెచ్చియిచ్చిన ఉత్తరం" అని కొంతసేపు ఆగి "చూడు. దీన్ని ప్రాణంతో సమానంగా చూచుకోవాలి. జేబులో ఉంచుకో. సాయంత్రం ఐదుగంటలకు సరిగ్గా దీన్ని నాకందజెయ్యాలి. అన్నట్టు నువ్వు పెళ్ళికుమారుడి దుస్తుల్లో ఉన్నావేం! ఎక్కడికైనా పరారీ చిత్తగించడం లేదుగదా!" అన్నారు.

అంతకు ముందురోజు తనకు లీవు సాంక్షను చేసిన డి. యస్. పి. గారు నేడా విషయం తమకు

బొ_త్తిగా తెలియనట్టు మాట్లాడు తున్నందుకు ఆశ్చర్య పడి శంకరనారాయణ "అబ్బే....లేదండి! మరి.... ఈ రోజు" అంటూ ఏంజవాబుచెప్పాలో స్ఫురించక కంగారుపడిపోసాగేడు.

శంకరనారాయణ సంజాయిషి వినిపించుకో డానికి తీరిక లేక రావుగారు వుత్తరాన్ని అతడిచేతికిచ్చి అంతటితో ఆవుత్తరం సమస్య పరిష్కారమై పోయి నట్టు "ఊఁ కదిలించవయ్యా నీరథం" అని డ్రయివరకు హుకుం జారీచేశారు.

శరవేగంతో పరుగిడి పోతున్న కారుని చూస్తూ శంకరనారాయణ అక్కడే నిలబడిపోయాడు. కొంత కాలంనుంచీ పై అధికారి కెందుకో తనపైన ఎనలేని ఆదరం కలిగినట్టు అతడికో అనుమానంవుండేది. ఆ అనుమానం కాస్తా నేటికి నిజమైపోయింది. ఎంత నమ్మకం లేకపోతే ఆయన ఈ వుత్తరాన్ని తన చేతి కిచ్చి వెళ్ళిపోతాడు! పైగా ఇది ప్రాణంతో సమానంగా చూచుకోవలసిన ఉత్తరమట!

శంకరనారాయణ మనోవీధిలో ఉన్నట్టుండి మరో అద్భుతమైన ఆలోచన విద్యుల్లతలా మెఱసి పోయింది. డి. యస్. పి. గారు తనను దూరపు బంధువని తల్లి చెప్పగా ఎన్నోసార్లు విని, అందువల్ల

మనకు ఒరిగే లాభముందిలే అనుకునేనాడు. ఆదూరపు బంధుత్వం దగ్గిర బంధుత్వంగా మారే అవకాశం ఉన్న దన్న దురాశ అతడిలో ఆక్షణంవరకూ మొలకెత్త లేదు. ఈ విచిత్రప్రపంచంలో ఎలాటి అనూహ్యామైన విషయాలు జరిగి పోతాయబ్బా! రావుగారికి పెళ్ళీడు వచ్చిన కుమార్తె ఉంది. గానోత్సవాల సందర్భంలో ఆ సంగతి శంకరనారాయణకు తెలిసింది. ఆమె ఎంత కమ్మగా పాడుతుంది!

నేలపైన నిలబడిన శంకరనారాయణ అలాగే ఆకాశానికి ఎగిరిపోయి అప్రయత్నంగా నోరు తెరచి "చక్కనైన చుక్కలోన ఒక్కసారి దూరెదా" అని పాడుకోసాగాడు. ఇంతలో బొంయ్‌బొంయి మని పోలీసులారీ హారన్ ఊదుకుంటూ అటువైపువచ్చి శంకరనారాయణని పరధ్యానంలో నుంచి ప్రపంచానికి తెచ్చింది. అతడు మెల్లగా రోడ్డుపైకివెళ్లి నడవ సాగేడు.

శంకరనారాయణ ఎర్రగా, పొడుగ్గా, సన్నగా ఉంటాడు. ఖాకీయూనిఫారమ్ కన్నా మామూలు సివిలు డ్రస్సు అతడికి బాగుంటుంది. వదులుపాటి పైజమా పైన మోకాళ్ళవరకు వచ్చే జుబ్బాను తొడుక్కుని మెడలో మఫ్లరుప్రేలాడగా చెంపకు చేరడేసిగా ఉన్న

కళ్లని నల్లద్దాల కళ్లజోడులో దాచుకుని సన్నగా ఈల పాట పాడుకుంటూ వీధిలోనడుస్తుంటే షూటింగు తర్వాత మేకప్‌తోసహా బయటికివచ్చిన సినిమానటు డిలా ఉంటాడు శంకరనారాయణ!

శంకరనారాయణ కాలేజీలో వృక్ష, జంతు శాస్త్రాల్ని క్షుణ్ణంగా చదువుకున్నాడు. దేశంలోని మారు మూలల్లోవున్న మహారణ్యాల్లో తిరుగుతూ కొండ కోనల రామణీయకతను, సెలయేళ్ళదాపున అల్లుకున్న పొదల్లో పూచిన రంగురంగుల పుష్పగుచ్ఛాలను చూస్తూ జీవితాన్ని తీయగా, హాయిగా గడిపివేయాలని అతడు కనిన పగటికలలన్నీ కల్లలై పోయాయి. తది తర మానవులకు, తమకుఏమాత్రం భేదమూ లేక వారిలోకలిసిపోయే దొంగల్ని కనిపెట్టడానికి కావలసిన మాయోపాయాలు, పాపం శంకరనారాయణకు తెలి యని విద్యలు! వీలుదొరికి నప్పుడల్లా అతడు సెలవు మంజూరు చేయించుకుని విశాల ప్రపంచంలోకి వెళ్లి పోతుంటాడు.

ఐతే ఈసారి శంకరనారాయణకు దొరికిన సెలవు రెండంటే రెండు రోజులు మాత్రమే! మనోజ్ఞ మైన ప్రకృతి దృశ్యాలు అంత స్వల్ప వ్యవధిలో చూచి రావడానికి అందుబాటులో లేవు. అందుచేత

శంకరనారాయణ పట్టణంలోకల్లా పొడుగాటి చెట్లలోనూ దట్టమైన పొదరింట్ల తోనూ, వివిధ జంతు వర్గాల తోనూ నిండి ఒక విధంగా అరణ్యంలా కనిపించే మృగశాలవైపుకు దారి తీశాడు.

నాలుగణాల ప్రవేశ రుసుము చెల్లిస్తూనే శంకర నారాయణ "ఇటీవల క్రొత్తగా ఏవైనా జంతువులు తెప్పించబడ్డాయండీ" అని గుమస్తాని ప్రశ్నించాడు.

"అదేమిటండీ, క్రొత్తగా అడుగుతున్నారు! పత్రికల్లోకూడా ఫొటోలు ప్రకటించామె! ఉత్తరదేశం నుంచి మేలురకపు నెమళ్లు వచ్చాయండీ" అన్నాడు గుమాస్తా.

శంకరనారాయణ దోవప్రక్కన బోనులో ఉన్న మృగాల్ని చూచుకుంటూ ఒక ఫర్లాంగు దూరం మెల్లగా నడిచాడు. అక్కడ చేపలకు, తాబేళ్ళకు నిర్మింపబడిన జలాశయం ఒకటుంది. ఆజలాశయం చుట్టూ కానుగ చెట్ల చల్లటి నీడ క్రింద శిలావేదికలు అమర్చబడి ఉన్నాయి. "అబ్బా! ఎంత చల్లగా ఉందిక్కడ! ఇందు కేనేమో కానుగ చెట్టు, కన్నతల్లీ సమానం అన్నారు పెద్దలు" అనుకుంటూ శంకరనారాయణ ఒక రాతి బెంచీపైన పడుకున్నాడు.

పడుకుని పైకి చూచేంతవరకూ శంకరనారాయణ ఉత్తర దేశపు నెమళ్లు కానుగ చెట్లుపైన కొలువు తీరి ఉంటాయనుకోలేదు. అబ్బో! ఆ నెమళ్ళ అంద చందాల్ని చూచినట్టయితే భగవతుండి సృష్టి రమణీయకతకు విస్మయపడని మానవు డెవడుంటాడు! అందులోనూ కవి కుమారుడు కావడానికి బదులు గ్రహచార వశాత్తుగా హెడ్ కానిస్టేబులుగా ఉద్యోగయాత్ర ప్రారంభించిన శంకనారాయణ కమ్మని వాసనలు చిమ్ముతున్న కానుగ పూత మధ్య కూర్చుని ఉన్న మత్తమయూరాల్ని చూచి ఆనంద పరవశుడై పోయాడు.

నెమళ్ళు కంటికి కనపడగానే శంకరనారాయణ "ఇవి పురివిప్పి ఆడితే ఎంతబాగుండును!" అనుకున్నాడు. ప్రకృతి సౌందర్యాన్ని చూడ్డంకోసం తపించిపోయే తనలాటి ప్రేక్షకుడిముందు నాట్యం చేయడానికి అవకాశం లభించినప్పటికీ ఆసంగతి పట్టించుకోకుండా నెమళ్ళు వృథాగా కాలం గడిపివేస్తున్నందుకు అతడు వాటిపై జాలిపడ్డాడు కూడా!

ఇంతలో ఒక మయూరం క్రిందకి దూకింది. శంకరనారాయణ లేచి కూర్చుని "నటనమాడవే మయూరి, నటనమాడవే" అని పాడసాగాడు. కానీ మయూరాలకు మానవ భాష తెలియదేమో! అది

శంకరనారాయణ పాటని నిర్లక్ష్యంచేసి ఒయ్యారంగా అటూ ఇటూ పచారు చేయసాగింది.

అప్పుడు శంకరనారాయణకు నెమలిని ఆకర్షించ డానికి మరో చక్కని ఉపాయం స్ఫురించింది. జేబులో ఉన్న చాక్‌లెట్ ముక్కను పైకి తీసి అతడు బెంచికి దగ్గరగా నేల పైన విసిరాడు. నెమలి పరుగెత్తి వచ్చి దాన్ని ముక్కున కరుచుకొని మ్రింగివేసి శంకర నారాయణకు కృతజ్ఞత చూపించడానికా అన్నట్టు మెల్లగా పింఛాన్ని విప్పసాగింది.

నాట్య ప్రదర్శనం ప్రారంభం కాబోతోందనగా అక్కడొక చిన్న ప్రమాదం జరగడానికి ఆస్కారం ఏర్పడింది. చాక్‌లెట్‌ను బయటికి తీస్తున్నప్పుడు దాని తోబాటు డి. యస్. పి. గారి అమూల్యమైన ఉత్తరం కూడా జేబిలోనుంచి జారి నేలపైనబడి గాలిలో అటూ ఇటూ కదలసాగింది. నిజమాలోచిస్తే ఆ వుత్తరం జేబులోనుంచీ జారి నేలపైన పడడం ఏమంత ప్రమాదం కాదు. కానీ ఆ వుత్తరాన్నికూడా చాకలెట్‌గా భావించి నెమలి దాన్నికాస్తా ముక్కున కరచుకుని మ్రింగివేయ బోయేసరికి నిజమైన ప్రమాదం జరగబోతోందన్న సంగతి శంకరనారాయణకు తెలిసి వచ్చింది. ఉత్తరం క్రింద పడిందన్న విషయం అతడి కంతవరకూ తెలి





యదు. అది జేబులో భద్రంగా ఉందనే అతడు భావించాడు. ఉన్నట్టుండి అది నెమలి ముక్కులోనుంచి ప్రత్యక్షం కాగానే అతడు కుప్పించి ఎగిరి నెమలి దగ్గరదూకి కవరును లాక్కోబోయాడు.

హఠాత్తుగా మనిషి తనపైకి వచ్చేసరికి నెమలి బెదరి పరుగు లంకించుకుంది. శంకరనారాయణ దాన్ని వెంబడించాడు. కానుగ చెట్లమధ్య నెమలికీ శంకర నారాయణకు రెండు నిమిషాలసేపు తీవ్రమైన రన్నింగు రేసు జరిగింది. కానీ అందులో గెలుపు ఎవరిదో తేలక ముందే డి. యస్. పి. గారివుత్తరం నెమలి ముక్కులో నుంచీజారి దాని జీర్ణకోసంలోపడిపోయింది.

'ఇప్పుడేం చేయాలి' అన్న భీకరసమస్యని ముందుంచుకుని శంకరనారాయణ చింతా క్రాంతుడై నిలబడిపోయాడు. కవరును పలహారంగా వినియోగించు కున్న నెమలి మాత్రం నిశ్చితంగా అక్కడే నడయాడ సాగింది. శంకరనారాయణ తీవ్రంగా ఆలోచించ సాగాడు. నెమలి కడుపులోఉన్న వుత్తరం తన చేతికి రాకపోతే, తనింక అక్కడనుంచీ వెళ్ళడంవల్ల లాభం లేదు. అంతటితో తనవుద్యోగమూ, తన భవిష్యత్తూ సర్వ నాశనమైపోతాయి.

శంకరనారాయణ ఒక్క ఉదటున ముందుకు దూకి పరధ్యానంగా వున్న నెమలిని చేజిక్కించుకుని ప్రాకారం దగ్గరికి పరుగెత్తాడు. ముక్కుతో గీకుతూ, రెక్కలతో కొడుతూ ద్వంద యుద్ధానికి తలపడిన నెమలిని విడిచి పెట్టకుండా ముందుకు పరుగెత్తడం శంకరనారాయణకు అంత సులభసాధ్యంగా కనబడ లేదు. సింహద్వారం గుండా పలాయనం చేయడానికా వీలులేదు. అక్కడెప్పుడూ కాపలావాళ్లుంటారు. ఇక కాంపౌండు గోడపైకెక్కి దూకడంకన్నా గత్యంతరం లేదు. అదృష్టవశాత్తు ఒక వేపచెట్టుకొమ్మ గోడపైకి వంగిఉండడంచూచి, శంకరనారాయణ తన చిన్ననాటి వృక్షారోహణ సామర్థ్యాన్ని ఉపయోగించి చెట్టుపైకి ప్రాకి కొమ్మపైనుంచి గోడపైకివచ్చి అక్కడనుంచి రస్తాలో దూకాడు.

రస్తాలోపడిన తర్వాత • శంకరనారాయణకు తనను ఎదుర్కొంటున్న సమస్య మరింత భయంక రంగా తోచింది.

నడివీధిలోపడి ఎక్కడికి పరుగెత్తడం? ఎలా పరుగెత్తడం? పట్టపగలే మృగశాలకు సంబంధించిన నెమలిని తస్కరించుకుని పారిపోతున్న దొంగను

ఎదురైనవారు ఎదురైనట్టే చావదన్నారని నమ్మకం ఏమిటి ?

ఈ విపత్కరపరిస్థితిలో శంకరనారాయణకు ఒక టాక్సీడ్రయివరు ఆపద్బాంధవుడిలా తోడ్పడ్డాడు. తప్పించుకుని పారిపోవడానికి ప్రయత్నిస్తున్న నెమలితో పేవ్మెంటుపైన కుస్తీపడుతున్న శంకరనారాయణని చూచి టాక్సీడ్రయివరు ఆశ్చర్యంతో టాక్సీ నిలిపి "ఏమండోయ్, నెమలి జూలోనుంచి పారిపోయి వచ్చిందేమిటి?" అన్నాడు. "ఆఁ ఏమిటి? అవును. అహఁ, కాదు". అంటూ శంకరనారాయణ టాక్సీలో దూరి నెమలిని సీటుక్రింద దూర్చబోతూ "డ్రయివర్! ఇప్పుడు మరేం మాట్లాడకు. అంతా తరువాత చెబుతాను, ఊఁ పోనీ, అర్జెంట్" అన్నాడు. డ్రయివరుకు శంకరనారాయణ వాలకం అనుమానాస్పదంగా తోచింది. అతడు నెమ్మదిగా "అబ్బే! ఇప్పుడంత తొందరేముందండీ? ఇంతకూ ఎక్కడికి వెళ్లాలంటారు?" అన్నాడు.

శంకరనారాయణ ముందుకువంగి "డ్రయివర్! అదంతా ఏమీ అడక్కు. నీకు మామూలుచార్జీకన్నా మూడింతలు ఎక్కువగా ముట్టజెప్పుకుంటాను. ఆలసించడం అపాయకరం! పోనియ్, పోనియ్! అని

ప్రతిమాలు కున్నాడు. ఈ మంత్రం డ్రయివరుమీద బాగా పనిచేసింది. టాక్సీకదిలింది.

ఆనాటి టాక్సీప్రయాణం శంకరనారాయణకు గాని, డ్రయివరుకు గానీ అంతెందుకు ఆ నోరూవాయీ లేని పక్షికిగానీ జన్మలో మరచిపోదగిందికాదు ! అంత వరకూ తాబేలు నడకలా పురోగమించే కోల్‌గాసు మోటారు బండిలోనైనా పయనం చేసి ఎరుగని ఆనెమలికి టాక్సీప్రయాణం ఎంత భయావహమైందో గానీ, అది ఒక్కపెట్టున పైకెగిరి రావణునితో జటాయువులా శంకరనారాయణతో ఢీకొన్నది. ముక్కుతో అదిపొడిచిన ప్రతిచోటా అతనిదుస్తులు చీలికలు వాలికలుగా చినిగిపోయాయి. దాని అరుపు కర్ణకఠోరంగా వినిపించిన ప్రతిసారీ టాక్సీడ్రయివరు గుండె జల్లన సాగింది. టాక్సీలోపలి గందరగోళాన్ని చూచి క్రోవపొడుగునా మనుషులు విస్తుపోసాగారు. దాన్ని తిలకించిన పోలీసులేమో జేబుల్లోంచి డైరీలను తీసి టాక్సీ నంబరు నోట్ చేసుకున్నారు.

టాక్సీలో కూర్చుని శరవేగంతో పట్టణాన్ని ప్రదక్షిణం చేస్తూ ఉన్నంత మాత్రంచేత శంకరనారాయణ సమస్య పరిష్కారమై పోలేదు. ఇలా ఎంతసేపు తిరగాలి ? ఈ నెమలిని ఏంచేయాలి ? చేయడానికి

మరేముంది! తొందరగా దాన్ని హతమార్చడం తప్పా! ఒకటి రెండుగంటల్లో నెమలి జీర్ణకోశంలోని వుత్తరం పూర్తిగా రూపుమారిపోవచ్చు, ఆ తరువాత దాని ప్రాణం తీయడంవల్ల తనకు కలగబోయే లాభమేమీ ఉండదు. ఆలోపలే ఈ మయూర మారణ హోమం నిర్విఘ్నంగా జరిగిపోవాలి! దాన్ని ఎలా జరపాలి? అది తనచేతనైన పనికాదు. (శంకరనారాయణ జన్మతహా శాఖాహారి!) సమయానికి ఎవడైనా కసాయివాడు తోడ్పడకూడదూ? తన స్నేహితుల్లో లెక్చరర్లు, డాక్టర్లు లాయర్లు ఎందరో ఉన్నారు. కసాయివాడొక్కడూ లేడు. ఎంత దురదృష్టం!

టాక్సీ ఒక పెద్ద రోడ్డులోనుంచీ చిన్న సందులోకి మళ్ళీ పరుగెడుతూ ఉండగా శంకరనారాయణకు ఒక ఆలోచన తట్టింది. ఆవీధిలో అతడికొక డాక్టరు మిత్రుడున్నాడు. ఆపరేషన్ కేసులలో అఖండుడుగా పేరుమోసిన అతడు నెమలి గర్భాన్ని ఛేదించలేక పోతాడా అనుకుని శంకరనారాయణ "ఈవీధిలో 44 నంబరు ఇంటిదగ్గర టాక్సీనిలుపు" అని డ్రయివరుకు ఆనతిచ్చాడు.

'డాక్టరు ఏ. యస్. చలం, ఎం. బి. బి. యస్' అన్నబోర్డు వ్రేలాడుతున్న ఇంటిముందు టాక్సీ

ఆగింది. శంకరనారాయణ నెమలిని బాహు బంధంలో ఇరకించుకుని తిరిగి చూడకుండా భవనంలోకి పరుగెత్తి మందుల్ని కలుపుతున్న డాక్టరుగారి ముందు కుర్చీలో కూలబడ్డాడు.

"ఏమిటిది శంకరనారాయణగారూ! తమరు దేనిపైనవచ్చారు ?" అని ప్రశ్నించాడు డాక్టరు చలం ఇంచుక విస్మయంతో.

"టాక్సీలో" అంటూ శంకరనారాయణ ఎదుట ఉన్న నిలువుటద్దంలో తన దుస్తుల్ని చూచుకొని తెల్ల బోయాడు.

"అలాగా! నేను మీరు కుమారస్వామిలా నెమలిపైన ఎక్కివచ్చారేమో ననుకున్నా" అన్నాడు డాక్టరు.

"మీహాస్యానికిది సమయం కాదు. డాక్టరుగారూ మీరునాకోసం ఇప్పుడీ నెమలికడుపు ఆపరేషన్ చేయాలి".

"అయ్యయ్యో, నేనెప్పుడూ పక్షులపైన ఆప రేషన్ జరుపలేదే" అన్నాడు డాక్టరు.

"అదేమిటండీ! మానవ శరీరంపైనే ఎక్క డంటే అక్కడ ఆపరేషన్ జరపగల మీకు ఈ పాడు

నెమలి ఒక లెక్కా డాక్టరుగారూ" అని బ్రతిమాలు కున్నాడు శంకరనారాయణ.

"ఊఁహూ. అది నాపనికాదు."

"డాక్టరు చలంగారూ! మీరీ సహాయం చేయక పోతే నా బ్రతుకు అడవిలో తెల్లారిపోతుంది. డి. యస్. పి. గారు ప్రాణంతో సమానంగా చూచుకోమన్న వుత్తరం ఇప్పుడు దీని గర్భాశయంలోవుంది. ఆవుత్త రాన్ని నేను అయిదుగంటలకల్లా ఆఫీసులో చేర్చక పోతే, మళ్ళీ అటువైపు పోవలసిన అవసరం వుండదు. డాక్టరుగారూ! ఫీజు ఎంతయినా సరే సమ ర్పించుకుంటాను".

డాక్టరు చలం కొంతసేపు తీవ్రంగా ఆలోచించి "ఐనాయింతమాత్రం పనికి ఆపరేషన్ ఎందుకయ్యా? ఏదైనా 'ఎమిటిక్'ను ప్రయోగించ కూడదూ!" అన్నాడు.

"అవునవును. ఆసంగతే మర్చిపోయాను. అలాటి దేదైనా చేసి చూడండి డాక్టరుగారూ!"

ఆ తరువాత డాక్టరుగారి గదిలో చెప్పలేనంత హంగామా జరిగింది. శంకరనారాయణ నెమలి కాళ్లను రెంటినీ బంధించి గట్టిగా పట్టుకోగా డాక్టరుగారు బల వంతంగా దానిచేత ఒక మందును త్రాగించారు. ఆ

మందు నెమలి గర్భకోశంలో పెద్దకల్లోలాన్నే రేపి వుండాలి! లేకుంటే అదెందుకు నిప్పుత్రొక్కిన కోతిలా పైకెగిరెగిరి క్రిందపడుతూ మందుసీసాలనూ, ఇంకు బాటిల్‌నీ క్రిందికి తోసేస్తుంది?

అరగంటసేపు అలా వీరవిహారం చేసినపిమ్మట ఆనెమలి ఎందుచేతనో కదలడానికి సైతం శక్తిలేనట్టు కుప్పకూరగా నేలపైన కూలబడింది.

అప్పటినుంచీ అది డోక్కోవడం ప్రారంభించింది. కొంత జీర్ణమై, కొంత జీర్ణంకాని ఆహార పదార్థంతో ఆగదినేల ఖరాబై పోయింది. వీధుల్లో వెళ్తున్న వారు సైతం 'అబ్బే, ఏమిటిది' అని ముక్కులు మూసుకుని పారిపోసాగారు!

ఎలాగైతేనేం, డి. యస్. పి. గారి అమూల్యమైన వుత్తరం కూడా డాక్టరుగారి అద్భుత చికిత్సా ప్రక్రియద్వారా బయటికి వచ్చింది.

శంకరనారాయణ ఆవుత్తరాన్ని చేతికి తీసుకుని "డాక్టరుగారూ! ఈపాటికి డి. యస్. పి. గారు నారాకకోసం ఆఫీసులో వేచి ఉంటారు. మళ్లీ మిమ్మల్ని కలుసుకుంటాను సెలవు" అని తలుపు తెరచి అడుగు ముందుకు వేశాడు.

"ఇదిగో చూడండి శంకరనారాయణగారూ! మీరు నన్ను కలుసుకున్నా, కలుసుకోకపోయినా అందుకు నాకు చింతలేదు. కానీ ఆ మీపక్షిస్నేహితుణ్ణి మాత్రం ఇక్కడ వదిలిపెట్టిపోవడానికి వీల్లేదు."



"నేను దాన్ని మా ఆఫీసుకు తీసుకపోలేను కదండీమరి."

"మీరు దాన్నేం చేసుకుంటారో నాకు తెలియదు. కానీ అదిక్కడమాత్రం ఉండకూడదు.

శంకరనారాయణ ఇస్సురని నిట్టూర్పు విడుస్తూ చలనంలేక పడిఉన్న నెమలిని తీసుకుని బయటికివచ్చి టాక్సీలో కూర్చున్నాడు. డ్రయివరు ఆ నెమలి దుస్థితికి జాలిపడుతూ "ఇప్పుడు మరెక్కడికి వెళ్ళమంటారు సార్" అని అడిగాడు "మనం ఎక్కడ బయల్దేరామో అక్కడికే వెళ్ళనీ" అన్నాడు శంకరనారాయణ. జూ ప్రహరీ గోడకు ఆవల నిలబడి నెమలిని జూలోకి విసిరివేస్తే అది ఎలాగో పీడవదలిపోగలదని అతడు ఒకటి రెండు నిముషాల వ్యవధిలో ఒక చక్కటి పథకం నిర్ణయించుకున్నాడు.

ఎంతో జాగ్రత్తగా నిర్ణయించుకోబడ్డ పథకాలు సైతం ఈలోకంలో తారుమారై పోతుంటాయి. శంకరనారాయణ పథకానికిగూడా అలాటి దురవస్థే పట్టింది. జూ దగ్గర టాక్సీ ఆగగానే క్రిందికి దిగిన అతనికి నెమలిని దొంగిలించిన వాడికోసం ఊరంతా గాలించి వేస్తున్న పోలీసులిద్దరు ఎదురై స్వాగత మిచ్చారు!

శంకరనారాయణకు ఆ పోలీసులిద్దరూ అపరిచితులు. పట్టణంలో పది పన్నెండు పోలీసు స్టేషను

లున్నాయి. ఈ పోలీసులు అందు — దేనికి సంబంధించిన వాళ్లో శంకరనారాయణకు తెలియదు. ఐనా అతడు తను సబ్ ఇన్‌స్పెక్టరునని, వాళ్ళతో పరిచయం చేసుకో బోయాడు. వాడినముఖంతో, చెదరిన క్రాపింగుతో, చిరిగిన బట్టలతో బికారిలా తయారయిఉన్న శంకర నారాయణ తను సబ్‌ఇనస్పెక్టరునని చెప్పుకున్నందుకు మాత్రమే పోలీసులు విరగబడినవ్వి "తమరు సబ్‌ఇన్ స్పెక్టరు మాత్రమే ఏమిటండీ! సాక్షాత్తు ఇన్‌స్పెక్టరు జనరల్‌గారి మేనత్తకొడుకులా ఉన్నారు! అదంతా వేరే విషయం. తమరు ముందుగా ఆ పోలీసుస్టేషనువరకు వచ్చి మా ఆతిథ్యాన్ని కాస్తాస్వీకరించండి" అన్నారు.

డి. యస్. పి. గారు క్యాంపునుంచి తిరిగి రాగానే శంకరనారాయణకోసం కబురు పంపించారు. అతడికోసం వెళ్ళినవాళ్లు తిరిగిరాక ముందే గణగణ మని ఫోన్ మ్రోగింది. మళ్లీ ఎక్కడ అవాంతరం జరిగిందోనని ఆయన రిసీవరును చేతికి తీసుకుని "హలో ఏవరూ? అన్నారు.

"నేనేనండి శంకరనారాయణని!" అని బదులు వచ్చింది.

"అరరే నువ్వా! ఎక్కడున్నావయ్యా నేనిక్కడ నీకోసం ఎదురు తెన్నులు చూస్తుంటేనూ!"

"క్షమించండిసార్! ఒక చిన్న పొరపాటు జరిగింది. అందువల్ల ...."

"అందువల్ల?"

ఇప్పుడు గాంధీరోడ్డు పోలీసు స్టేషనులో వున్నాను."

ఉంటావు, ఉంటావు! నీకేమయ్యా, నువ్వెక్కడైనా ఉంటావు. ఐతే నీకు ఇప్పుడప్పుడే అక్కడ నుంచి వచ్చే ఉద్దేశం లేదన్నమాట."

"ఎలా రానండీ! ఇప్పుడు నేనున్నది పోలీసుల కాపుదారిలో" "ఏమిటీ! ఎందుకూ?"

"ఒకచిన్న ...."

"సరేసరే! ఆ చిన్న పొరబాటేదో తీరిగ్గా ఏడుద్దువుగానీలే" అని డి. యస్. పి గారు రిసీవరు క్రిందపెట్టి, తక్షణం శంకరనారాయణని విడుదల చేయవలసిందిగా గాంధీరోడ్డు పోలీసుస్టేషనుకు కబురు పంపించారు.

ఆ కబురు వెళ్ళిన అరగంటసేపటికి శంకరనారాయణ డి. యస్. పి. గారి ముందర హాజరుగావింపబడ్డాడు!

శంకరనారాయణ వెళ్ళబోసుకున్న సొదనంతా సావధానంగా విని నవ్వడానికి మనస్కరించక, ఏడవడానికి మనసురాక ఆఖరకు మౌనంవహించి అకడి చేతినుంచి తన వెలలేని పుత్తరాన్ని తీసుకుని డి. యస్. పి. గారు మెల్లగా కవరు చింపారు. కవరులోనుంచీ ఒక చిన్న కరపత్రం లాటిదిజారి క్రింద పడింది!

ఇదేమిటి! ఇంత జేసీ ఇదేదో గ్రీటింగు కార్డు బాబూ! దీనిపైన ఏదో అక్షరాలున్నట్టున్నా... అంటూ డి. యస్. పి, గారు ఆ తొందరల... జోడు కనబడక పోవడంచేత ఆ కాగితాన్ని ... నారాయణ చేతికిచ్చారు.

"రాజశ్రీ మామయ్యగారికి రామం పంపుకున్న ఉగాది అభినందనలు" అని చదివాడు శంకరనారాయణ ఇంచుమించు ఏడుపుముఖం పెట్టి!

"అరరే అదాసంగతి! కవరుపైన మదరాసు అన్న ముద్ర కనబడగానే నేను ఇది ఐ. జి. ఆఫీసు నుంచి వచ్చి ఉంటుందని పొరబడ్డాను. ఇంతకూ యిది మారామంగాడు నాకు పంపిన ఉగాది అభినందన లన్నమాట! అయ్యో పాపం! అనవసరంగా చాలా

శ్రమపడ్డావు శంకరనారాయణా! ఐయామ్ రియల్లీ సారీ!"
అన్నారు డి. యస్. పి. గారు

వెనుక ఆనుకోవడానికి గోడ వుండటంవల్ల శంకరనారాయణ గుభేలున క్రిందపడిపోకుండా నిలువరించుకోగలిగాడు!

[ఆధారం ఐ. ఎ. విలియమ్స్]





ఒక్కొక్కప్పుడు ఈ ప్రపంచంలో మానవుడు కలలోనైనా ఊహించలేని అద్భుతమైన సంఘటనలు జరిగిపోతుంటాయి. గొప్ప గొప్ప రచయితలు తమ అమోఘమైన మేధాశక్తితో కల్పించే చిత్రవిచిత్ర కథలకన్నా లోకంలో జరిగే వాస్తవిక సంఘటనలే ఒకప్పుడు ఎక్కువ ఆశ్చర్యకరంగా వుంటాయికూడా!

# 1933

1933, అక్టోబరు మొదటివారంలో ఈ కథ ప్రారంభమౌతుంది. అప్పటికి నాగరికత ఏ పట్టణాల్లోనో తప్ప, పల్లెటూళ్ళలోకి అట్టే వ్యాపించలేదు. కోటు, హాటు, బూట్లతో మెడకొక టై కట్టుకొన్న ప్రభుత్వోద్యోగిని చూస్తే, సాయకు వెయ్యి బస్తాల ధాన్యం పండించే మోతుబరి రైతు సైతం గడగడలాడేవాడు. ఒక మైలు దూరంలో ఎక్కడో బస్సు వచ్చే శబ్దం వినబడితే గ్రామాల్లోని పిల్లా, జెల్లా అందరూ రోడ్డుదగ్గరకు పరుగెత్తి విపరీతమైన ఆనంద కోలాహలంతో దానికి స్వాగతమూ, వీడ్కోలు ఒకేసారిగా ఇచ్చేవాళ్ళు. ఇక రైలు ప్రయాణం చేయడమంటే పల్లెటూరివాళ్ళకు ఏనుగెక్కినంత సంబరంగా వుండేది.

ఇరవై పేళ్ళకముందు ఎవరైనా తిరుపతి వేంకటేశ్వర స్వామిని దర్శించడం కోసమో, చంద్రగిరిలో తెలుగురాజులు నిర్మించిన రాజమహలను వీక్షించడం కోసమో, లేక మరే కార్యార్థమో గూడూరు, పాకాల జంక్షన్ల మధ్య రైలు ప్రయాణం చేసివున్నట్టయితే, వాళ్లు చంద్రగిరి, తిరుపతి స్టేషన్లకు మధ్య రైల్వే వారధిక్రింద ప్రవహించే సువర్ణముఖినదీ తీరంలో రైలుదారికి ఒక మైలు దూరంలో

1999

రెండు కొండలమధ్యన వున్న ఒక చిన్న పల్లెటూరిని తప్పక చూచివుంటారు. ఆ కుగ్రామం పేరు పెంటపాడు ఇరవై ముప్పై పూరిండ్లు, ప్రభుత్వంచేత గుర్తింపబడని ఒక వీధిఉండి, మన కథాకాలంనాటికే సంపూర్ణ శిథిలావస్థలోవున్న సీతాలక్ష్మణ సహితుడైన శ్రీరామచంద్రమూర్తి కోవెల, ఈ హంగులతో ఆవూరు మిగతా ప్రపంచంతో సంబంధం వదలుకుని అడవుల్లో కందమూలాదులు తింటూ కాలక్షేపంచేసే సన్యాసిలా కనపడేది రైల్లో ప్రయాణించేవారికి. సందె చీకటి వేళల్లో చెట్లమధ్యన వున్న ఇళ్లు కనపడక, గ్రామానికి ప్రక్కనవున్న రెండు కొండలు, ఇళ్ళల్లో ఆపాటికి వంటలు ప్రారంభమౌతాయి గనుక చూరుల్లోనుంచీ బయటికి వచ్చి సుడులు సుడులుగా గగనానికి ప్రాకిపోయే పొగ—వీటినిచూచి రైలు ప్రయాణీకులు ఆ చిట్టడివిమధ్య ఎవడో ఒక కాపాలికుడు మారణహోమం చేస్తున్నాడేమోనని భీతి చెందేవాళ్లు.

ఆవూళ్లో, కోవెలకు ఎదురుగా వున్న ఒక చిన్న పూరికొంపలో సీనయ్య అనే సజ్జనుడు నివసించేవాడు. చంద్రగిరిరాజులు 'అరివైరికంఠ విలుంఠన కాలకంఠీరవులై' అనేక యుద్ధాలు చేసినకాలంలో సీనయ్య యొక్క పూర్వీకులు కాసెచుట్టి, కత్తిబట్టి కలియుగ

సవ్యసాచుల్లా శత్రువుల్ని తునుమాడి ఆ పరగణాలో ధైర్యానికి, శౌర్యానికి పెట్టింది పేరుగా ప్రసిద్ధి చెందారు. కానీ, తాత ముత్తాతల శౌర్యసాహసాల్ని బట్టి సీనయ్యను కూడా ఒక మహావీరుడికింద జమకట్టడం అంత సబబుకాదు గదా ! వీరత్వం సంగతి ఎలాగున్నా వినయానికి, సౌజన్యానికి, నీతికి, నిజాయితీకే సీనయ్య ఆట పట్టయినవాడు. అతడింత మంచివాడు కావడానికి అతడి భార్యయే కారకురాలని పెక్కుమంది భావించే వారు. స్వగృహంలో గయ్యాళి భార్యయొక్క నోటి దురుసుతనం క్షణక్షణమూ తనపైన విరుచుకు పడు తున్నప్పటికీ, ఇంచుకైనా చలించకుండా తాల్మిని వహించగల మగవాడు ఆత్మ నిగ్రహంలో బ్రహ్మర్షులను మించిన వాడనీ, అలాటివాడు లోకులచేత మంచి వాడనిపించుకోవడం ఒక అతి సామాన్యమైన విషయ మేనని విజ్ఞులు చెబుతుంటారు. నిత్యమూ, నిరంతరమూ ఐన బాధల్ని మారు మాటాడకుండా భరించ గల ఓర్పును ప్రసాదించే గయాళి భార్య దొరకడ మనేది కూడా భగవంతుడి వరప్రసాదమే అయితే, అలాటి వరప్రసాదం మాత్రం సీనయ్యకు రెండు మూడింతలు ఎక్కువగా లభించిందని మనం బల్లగుద్ది వక్కాణించుకోవచ్చు.

సీనయ్యా భార్యపేరు సంక్షేపంగా తాయారు. పూర్తిగా చెప్పాలంటే అలిమేలు మంగతాయారు. పెంటపాడు వనితామండలికి సీనయ్యా ఎంత స్నేహ పాత్రుడో, తాయారమ్మ అంత ఆజన్మ శత్రువు.వాళ్ళకు. సీనయ్యామైపువున్న జాలి అభిమానాలేగాక, తాయారుపై గల ద్వేషం, ఆగ్రహాముకూడా అపారం. సీనయ్యాలా వాళ్లభర్తలు వాళ్ళకు లొంగివుండక పోవడమే ఇందుకు కారణం కావచ్చు. పంటలు ముగిసిన తర్వాత, మగ వాళ్ల పొలాలనుంచీ ఇంటిముఖం పట్టడానికి ముందూ జరిగే పెంటపాడు మహిళా మండలి సమావేశాల్లో సీనయ్యా తప్పక పాల్గొనేవాడు. అతడు వీధిలో కన బడితేచాలు, పిల్లలందరూ నవ్వుతూ, చప్పట్లు చరుస్తూ అతడివెంట బడేవారు. రెండు జట్లుగాచీలి పిల్లలు ఆడుకునే ఆటలకు మధ్యవర్తిగా వుండుటేగాక గాలి పటాలు, బొంగరాలు, బంకమట్టి బొమ్మలు మొదలైన ఆటవస్తువులు చేసియిస్తూ సీనయ్యా బాల బాలికల కంద రికీ 'అనుంగు చెలికాడు'లా వుండేవాడు.

సీనయ్యా ప్రవర్తనలోవున్న ఒకేఒక్క ముఖ్య దోష మేమిటంటే, లాభదాయకమైన ఏ పనిమీదగానీ అతడికి బొత్తిగా యిష్టం లేకపోవడం. అందువల్ల అతడిని సోమరిపోతన డానికి ఎంతమాత్రమూ వేల్లేదు.

ఇరుగుపొరుగు వాళ్లు ఒక్కసారి ప్రాధేయ పడితేచాలు, అతడు కొండలైనా పిండిచేయడానికి సిద్ధంగా వుండే వాడు. అంత గొప్పపనులదాకా ఎందుకూ, పొరుగింటి మల్లమ్మ బాలింతరాలుగా వున్నప్పుడూ, ఎదురింటి ఎల్లమ్మకు సిరోవేదన కలిగినపుడు సీనయ్యే ఆహ్వానం లేకపోయినా వెళ్లి వన్నుదంచి యివ్వడమో, కట్టెలుచీల్చి యివ్వడమో చేసేవాడు. ఒక మాటలో చెప్పవలసివస్తే ఇతరులకోసం ఎంత కష్టమైన పనయినా చేయడానికి సంసిద్ధుడయ్యే సీనయ్యకు తన యింట్లో మాత్రం ఈవైపున పడివున్న చెత్తను ఆవైపుకు చేర వేయడం కూడా ఒక అసాధ్యమైన పనిగా తోచేది.

సేద్యం చేయడం ఒక నిరుపయోగమైన పని అని అతడెప్పుడో నిర్ధరించు కున్నాడు. అందుకు తోడూ అతనికున్న కొద్దిపాటి భూమికూడా వట్టి చవిటిపర్ర. పెంటపాకు ప్రక్కన ఎక్కడైనా గరుమ లేనిపొలం, కంచెలేనిపైరు కనబడితే అది తప్పనిసరిగా సీనయ్యదై వుంటుంది. ఆల కొసర్లు ఆదమరచి ఏ చెట్టుక్రిందనో పడుకుని నిద్రపోతే, ఆవులన్నీ కలిసి మాట్లాడుకున్నట్టు ఒక్కుమ్మడిగా వెళ్ళి సీనయ్య పైర్లలోపడేవి! చుట్టుపక్కల పొలాల్లోనుంచీ వెడల

గొట్టబడిన కలుపుచెట్లన్నీ సీనయ్యయొక్క మంచి తనాన్ని ఆసరాగా చూచుకొని అతని పొలాల్లో ఏపుగా పెరిగి ఒక తోపుగా మారిపోయేవి!

సీనయ్య పెద్ద కుమారుడి పేరు గోపులు. వాడిని గురించి చెపుతూ వృథాగా కాలహరణ చేయడం కంటే గుణగణాల్లో వాడు సీనయ్యకు డిటో అనేయడం ఉత్తమం. గోపులుకంటే చిన్నవాడు రాముడు. ఆ కుటుంబంలో తప్పిపుట్టినట్టుగా రాముడు మాత్రం ఆవుల్ని మేపుకురావడం, గడ్డి కోవడం — ఇలాటి ఉపయుక్యాలైన పనులుచేసి తాయారమ్మకు అభిమాన పాత్రుడయ్యాడు.

కష్టపడి ఒకరూపాయ సంపాదించడంకన్నా, పస్తుండి ఒకణా దారపోసు కోవడమే మంచిదని భావించి, చింతలకు వంతలకు అతీతులైన మహావిరాగుల శాఖకు చెందినవాడు సీనయ్య. తాయారమ్మ గనుక వేపుక తినకుండావుంటే అతడొక రాజాధిరాజులా జీవితాన్ని సంతృప్తితో గడిపివేసి వుండేవాడు. కానీ ఆమె రాత్రినక, పగలనక కుటుంబాని కతడు తెస్తున్న వినాశనాన్ని గురించి మాటమాటకీ లెక్చరిస్తూ సంతత ధారాపాతంగా చివాట్ల వర్షం కురిపిస్తూ

వుండడం వల్ల అతనికి గృహపరిసరాల్లో భద్రతలు లభ్యమయ్యేవి కావు. అందువల్ల అతడు తయారమ్మ నోరు విప్పకపోవడం అవసరంగా ఇంట్లోనుంచీ నిష్క్రమించేవాడు.

ఎలాటి విషమ విపత్కర పరిస్థితిలోనైనా సరే సీనయ్యను తోకపిడలా అంటుకుతిరిగే ప్రాణి ఒకటుండేది. దానిపేరు భైరవి సోమరిపోతులకే గనుక ప్రత్యేకంగా ఒక రాజ్యమంటూ ఏర్పడితే దానికి సీనయ్యను రాజుగాను, భైరవిని ప్రధానమంత్రిగానూ నియమించ వచ్చునని తాయారమ్మ అభిప్రాయం. ఆమెకు కోపంవస్తే అది ఒక్క సీనయ్యపైనే కాదనీ, ఆకోపం యొక్క ప్రభావం తనపైన గూడా ప్రసరించ వచ్చుననీ భైరవికి బాగా తెలుసు. నిజంచెప్పవలసివస్తే భైరవి పిరికిజంతువు కానేకాదు. అ మాటకువస్తే అది అరణ్యంలో ఎలాటి క్రూరమృగాన్నయినా చీల్చి చెండాడగల జాగిలరాజం — ఐనా సమస్త జగతినీ గడగడ లాడించగల గయ్యాళితనం ముందు ఎంతటి ధైర్య సాహసాలైనా తృణప్రాయాలేకదా! ఎవరింటి దగ్గరైనా, ఏ వీధిలోనైనా, కడకు మహారణ్యాల్లో నైతం నిర్భీతిగా సంచరించే భైరవి తన యజమాని ఇంట్లో మాత్రం తనేదో భయానకమైన పరిస్థితిలో

ఇరుక్కుపోయినట్టు, ముఖం వేల వేసుకుని వుంటూ పీటకొయ్యనో, చీపురుకట్టనో, మజ్జిగ చిలికే కవ్వాన్నో 'గాజుల చేయి' ఎత్తుకున్నట్టు శబ్దం వినరాగానే తుర్రు మని బయటకు పారిపోయేది.

ఉపయోగించనూ, ఉపయోగించనూ పదునెక్కే ఆయుధ మేదైనా వుంటే అది ఒక నాలుక మాత్రమే నన్నసామెత తాయారమ్మపట్ల నిజమైంది. అందువల్ల రానురానూ సీనయ్యకు తన జీవితం దుర్భరమనిపించింది. అలా అనిపించినప్పుడల్లా అతడు తన మనోధైర్యాన్ని పోగొట్టుకునేందుకు ఇల్లు విడిచిపెట్టి, కోవెలకు వెనుకవైపునవున్న రాగిచెట్టు క్రిందలి రచ్చవద్దకు వెళ్లి అక్కడ సమావేశమై సన్యాసులు, వేందాంతలు, మరేం పనిలేని సోమరిపోతులూ నిరంతరమూ కొనసాగించే ఇష్టాగోష్ఠిసమావేశాల్లో పాల్గొనేవాడు. ఆ సమావేశాల్లో రాజకీయ సాంఘిక, ఆధ్యాత్మిక చర్చలెన్నో కలగాపులగంగా గంటల తరబడీ కొనసాగి, కడకు ఏ తీర్మానానికి రాకముందే అంతమయ్యేవి, పట్నాన్నుంచి దారితప్పి ఆ వూళ్లోకి వచ్చిన నాకరికుడక్కడ దిగవిడిచిపోయిన పాత వార్తాపత్రికను కొంచెంగా చదువు తెలిసిన సీనయ్యే చదివి వినిపించగా, ఆ వార్తలను గురించి అక్కడక్కడ

జరిగే వాదోపవాదాలు ఏ రాజ్యతంత్రజ్ఞునికైనా పాఠాలు నేర్పించ గలంతటి సునిశితంగా అలరారేవి!

కానీ ఆ రచ్చపైన గూడా సీనయ్యకు భద్రత లభ్యమయ్యేదికాదు. ఎప్పుడో ఒకప్పుడు తాయారమ్మ ఝంఝా మారుతంలా అక్కడికి రావడమూ. ఒక్క సీనయ్యనేగాక అక్కడున్నవాళ్ళ నందరినీ ఆమె ఏక ధాటిగా దుయ్యబట్టడమూ, తుపాకీవేటు వినగానే దిక్కులకు పారిపోయే కాకి మూకలా రచ్చపైన పెద్దలు చెల్లా చెదరుగా వెళ్ళిపోవడమూ సర్వసామాన్యంగా జరుగుతుండేవి. సీనయ్యవల్ల తమకందరికి తలవంపులు కలుగుతున్నందువల్ల రచ్చపైని సభికులు అతడు చాపుకు రాగానే మోమాటం విడిచి అక్కడ నుంచి వెళ్ళిపొమ్మనేవారు. అలాటి పరిస్థితిలో నిరాశ్రయుడైన సీనయ్య పొలం పనినీ, భార్య పోరునూ తప్పించుకో డానికోసం తాతలనాటి పాతతుపాకిని చేతధరించి కొండల కావైపున వున్న అడవుల్లోకి వెళ్ళిపోయేవాడు. అక్కడ ఏ సెలపటి ఇసుక తిన్నపైన్నయినా కూచుని తన చెంతనే తోకాడిస్తూ పడుకున్న భైరవితో "ప్రియ భైరవీ! ఈ ప్రపంచం నా కన్నా నువ్వు, నీకన్నా నేను నిస్సహాయులం. మన కష్టాలెప్పుడు గట్టెక్కుతాయో" అని వాపోయేవాడు.

మామూలు ప్రకారము సీనయ్య ఒకానొక నాడు అడవిలో డొంకదారులవెంట తిరిగి, తిరిగి అలసిపోయాడు. బారెడు దూరంలో కనిపించిన కుందేలొకటి అతడిని నాలుగైదు మైళ్ళదూరం త్రిప్పించి, కడకు తుపాకీ వేటను తప్పించుకుని పారిపోయింది. అప్పటికి సూర్యుడు నడిమింట దుర్నిరీక్షంగా మండిపోతున్నాడు. తెల్లవారి చల్దన్నమైనా తినని కారణంచేత సీనయ్య ఆకలికి తాళజాలలేకపోయాడు. పైగా మితిమీరిన ఆయాసం వల్ల అతడు మరొక్క అడుగైనా ముందుకు వేసేందుకు శక్తిలేక కొండ కొమ్ముపైన, ఒక బొంత జముడు చెట్టుక్రింద కూలబడ్డాడు.

అతడు పడుకున్న చోటునుంచి క్రిందికి చూస్తే ఒక అగాధమైన లోయ కనబడుతుంది. ఆ లోయలో సువర్ణముఖి వంపులుగా తిరుగుతూ ప్రవహిస్తుంది. నది పేరువైపులా మొగిలి పొదలు దట్టంగా వ్యాపించి వున్నాయి. మొగిలి పూవుల కమ్మని వాసనలు అడవి అంతా సుగంధ భరితంగా చేస్తున్నాయి. ఆ దృశ్యాన్ని చూస్తూ సీనయ్య కొంతసేపటికి కళ్లుమూసుకుని కలత నిద్రపాలయ్యాడు.

సీనయ్య నిద్రనుండి లేచేసరికి సూర్యాస్త మించాడు. అంధకారం మెల్ల మెల్లగా దట్టమైపోతూ వుంది. తను ఇల్లు జేరుకునేసరికి రాత్రి చాలాపొద్దు పోతుందనీ, ఇంత ఆలస్యంగా వచ్చినందుకు తాయా రమ్మ తననిక ఎంతమాత్రమూ క్షమించదని భయ పడతూ సీనయ్య మెల్లగా కొండ దిగడం ప్రారం భించాడు.

అతడు పర్వతాన్ని అవరోహిస్తుండగా ఎవరో "సీనయ్యా! ఆగవోయ్ సీనయ్యా!" అనడం విని పించింది. అతడు చుట్టుప్రక్కల కలయజూచాడు. గూండ్లకు చేరబోతున్న పక్షులుతప్పా ఎవరేమి కనబడ లేదు. ఒకవేళ తనమతి చలించిందేమో ననుకొని అతడు మళ్లీ నాలుగడుగులు ముందుకు వేశాడు. ఈసారి కేక మరీ బిగ్గరగా వినబడింది. "అగవోయ్ సీనయ్యా, ఆగు" అని. పదిబారల దూరంలో వున్న ఒక పొదవైపు చూస్తూ భైరవి మొరగడం సాగిం చింది" సీనయ్య ఆవైపుకి దృష్టిసారించి పొదమరుగు నుంచీ తన వైపుకు వస్తున్న ఒక విచిత్రవ్యక్తిని చూచి వెరుగుపడ్డాడు. ఏడడుగులకు తక్కువకాని ఒడ్డు పొడవు, అందుకు తగినలావు, చాకిరేవు బానం తటి తల. ఉన్నవా, లేవా అన్నట్లున్న చిన్నకండ్లు,

వంపుతిరిగిన మీసాలు, పర్వత శిఖరంవలే పైకి కన
బడుతున్న ముక్కు - ఈ ఆకారంతో ఆపాదమస్త
కం నల్లని దుస్తుల్లోవున్న ఆ వింతమనిషి తల పైన
ఒక పీపాను మోసుకుంటూ, చావి చావి అంగలువేస్తూ



సీనయ్యతో "ఈ పీపానుకాస్త తీసుకోవయ్యా"
అన్నాడు. సహాయ నిరాకరణమనే దుర్గుణం ఏకోశానా

లేని వాడు కాబట్టి సీనయ్య ఆ పీపాను తీసుకొని తన తలమీద వుంచుకుని ఆ అగంతకుణ్ణి వెంబడించాడు.

అప్పటికి బాగా చీకటైపోయింది. అమావాస్యకు ముందురోజు కాబట్టి ఆకాశాన నక్షత్రాలు మాత్రం మిన్కుమిన్కు మంటున్నాయ్. తూర్పు కొండపైన వున్న నీలమేఘ మొకటి ఆకాశమంతా అలముకోడానికి గట్టి ప్రయత్నమే చేస్తోంది తలపైన పెద్ద బరువుండడం చేత సీనయ్యకు ముందుచూపు సరిగ్గా ఆనడంలేదు సుమారు నాలుగైదు ఫర్లాంగులు నడిచిన తర్వాత అతడు "మనమిప్పుడెక్కడికి పోవాలండి?" అని సవినయంగా ప్రశ్నించాడు. "అలాటి ప్రశ్నలడిగావంటే చెంప పళ్లు రాలిపోతాయ్ సీనయ్యా! మాట్లాడకుండా నన్ను వెంబడించు" అన్నాడా వింత మనిషి. వెనుదిరిగి చూపుల్తోనే అతడిని భయపెడుతూ!

ఎటుచూచినా నిశ్శబ్దమే తాండవిస్తున్న ఆ అరణ్యంలో, తారకలైనా కనరాని ఆ కాళరాత్రిలో, ముండ్లతో గుండ్లతో నిండిన కాలిబాటలోబడి ముందా విచిత్రవ్యక్తి, తరువాత సీనయ్య, సీనయ్యను వెంబడిస్తూ భైరవి ఎంతదూరం వెళ్లివుందురో ఎవరు చెప్పగలరు! ఎప్పుడో ఒకప్పుడు ఆ వింతమనిషి "ఇక పీపాను దించు" అనడం విని సీనయ్య పీపాను కిందికి

దించి తన చుట్టూ కలయ పరికించాడు. అప్పుడతత డున్న చోటు కొండగుహ! ఆ గుహలో ఒక మూలగా గుడ్డి దీపమొకటి వెలుగుతోంది. ఆ దీపం చుట్టూ ఒక గుండ్రని అరుగుమీద ఆకారంలోనూ వేషంలోనూ సీనయ్యకు పరిచితుడైన వింత లాగే వున్నవ్యక్తులు ఏడెనిమిదిమంది జూద కుంటున్నారు. ఆ జూదమార్గం కూడా ఏదో పానికి కన్నట్టుగాక ఒకడినొకడు మింగేయ కొన్నంత తీవ్రంగా వుండడం చూచి సీనయ్య ర్యమో, భయమో, విస్మయమో లేక ఆ మ యొక్క సమ్మేళనమైన భావమో కలిగింది. సీ కనబడగానే వాళ్లు ఒక నిముషంపాటూ ఆటనిలి అతడినొక చీదపురుగును చూచినట్టు చూచి మళ్లీ జూదంలో నిమగ్నులై పోయారు. సీనయ్య నక్కడికి తీసుకొచ్చిన వ్యక్తి ఒక చిన్న పాత్రను తెచ్చి అతడి చేతికిస్తూ పీపాలో వున్న మద్యాన్ని అక్కడున్న వాళ్ళందరికీ పంచవలసిందిగా ఆదేశించాడు. సీనయ్య చిన్నపాత్ర నిండుకూ మద్యాన్ని నింపీ నింపీ ఇస్తుం డగా మనుషులందరూ పొట్టలు నిండేవరకూ తాగి 'ఏవ్' అని త్రేన్చి 'ఇక నువ్వాత్రాగొచ్చు' అని సీనయ్యకు కంటితోనే సైగచేశారు. గర్భ కుహరంలో

ఆకలి మంటలు ప్రజ్వరిల్లి పోతున్నందువల్ల సీనయ్య వాళ్ళ మహౌదార్యానికి సంతసించి తనకు చాలనిపించేంత వరకూ పీపాలోవున్న ద్రవాన్ని గుటగుట త్రాగేడు.

త్రాగిన తరువాత సీనయ్యకు చాలా విచిత్రా అనుభవాలు కలిగినాయ్. తనకు రెక్కలువచ్చి, లో ఎగిరిపోతున్నట్టు స్వర్గం సమీపించినట్టు, తనకెన్నో సత్కారాలు జరుగుతున్నట్టు అనుకోసాగేడు. ఆతరువాత అతని మనసు ంచే శక్తి సయితం కోల్పోయింది. అతడు గాఢ ద్రలో మునిగి పోయాడు.

సీనయ్య మెల్కొనేసరికి రెండు బారలు ప్రొద్దెక్కింది. పక్షుల కిలకిలా రావాలు ఇంకా తగ్గలేదు. చల్లని మారుతం హాయిగా వీస్తోంది. సీనయ్య కళ్లు నులుముకుంటూ "అరరే, రాత్రంతా ఇక్కడే గడిపేసేనే! నిన్నంతా ఏం చేసావని తాయారడిగితే ఏమని సమాధానం చెప్పుకోను?" అనుకుంటూ లేచి నిలుచుకోబోయి కాళ్ళురెండూ తిమ్మిర్లుపట్టి వుండడంవల్ల నడవలేక మళ్ళీ కూలబడ్డాడు. కాళ్ళను అటూ, ఇటూ కదిలించి, ఒక దాంతో మరొకదాన్ని పెనవేసుకొని ఎలా

గయితేనేం రెండు గడియలు శ్రమపడి వాటిని తన స్వాధీనంలోకి తెచ్చుకొని అతడు లేచి నిలబడి మెల్లగా నడవగల్గాడు కానీ రాత్రి తానే దారిగుండా ఆ గుహ లోకి వచ్చాడో అతనికి తెలియలేదు. ఏ వైపు చూచిన దట్టమైన ముండ్ల పొదలే కనబడ్డాయి. రాత్రి ఏ అరుగు మీదనైతే జూదం జరిగిందో, ఆ అరుగుమీద పైనెక్కడినుంచో ఒక జలపాతం దూకుతోంది!

సీనయ్య తన తుపాకికోసం వెదికాడు. తుపాకికి బదులు త్రుప్పుపట్టిన రెండుమూడు ఇనుప ముక్కలు మాత్రంకన్పించాయి. భైరవినిఎలుగెత్తిపిలిచాడు.అరుపులతో కొండలు ప్రతిధ్వనించాయిగానీ, భైరవి తిరిగి రాలేదు.తనుసారాయి మత్తులో స్మృతిలేక పడివుండగా, ఆ విచిత్రపు మనుషులు తన తుపాకినీ, కుక్కనీ తస్కరించుకుని వెళ్లిపోయి వుంటారని సీనయ్య నిర్ధరించుకున్నాడు.

ముండ్లపొదల్లో ఎలాగో ఒకలాగు త్రోవజేసుకుని అతడు లోయలోకి దిగేప్పటికి మధ్యాహ్నమైంది. సువర్ణముఖిలో కడుపునిండా నీళ్ళయినా త్రాగుదామనుకున్నాడు సీనయ్య కానీ ఆ నదిలో నీటితోవున్న ఒక్క చిన్న చలమైనా అతనికి కనపడలేదు, "నిన్న

సాయంత్రం వరకూ నేనీ ఏటి దగ్గర్నే తిరిగానుకదా! అప్పుడు గట్లను తాకుతూ ప్రవహించిన నీరు ఒక్క రాత్రిలో ఎలా ఇంకిపోయిందో?" అని సీనయ్య ఆశ్చర్యపడ్డాడు.

అతడు ఊరి పొలిమేర చేరుకునేసరికి సాయంత్రం మూడుగంటలైంది. ఎందరెందరో అతని కెదురుగా వచ్చారు. అతడిని అబ్బురంతో చూచారు. వెళ్లిపోయారు. కానీ ఒక్కరు గూడా పలకరించలేదు. అతనికి ఒకవేళ తను సీనయ్య కాదేమోనని సందేహం కూడా కలిగింది. ఆ సందేహం తీరడానికని అతడొక సారి ముఖాన్ని తడివి చూచుకున్నాడు. ఆశ్చర్యం! అతడి చుబుకాలకు క్రింద ఒక మూరెడు పొడవుగడ్డం పెరిగివుంది!

మరొక్క ఆశ్చర్య మేమిటంటే ఎదురైన గ్రామస్థులు అతడిని గుర్తుపట్టలేక పోవటం అటుండగా అతడు సైతం వాళ్ళని గుర్తించలేక పోయాడు! పరిచితమైన ముఖం మచ్చుకైనా కనపడలేదు. అందుకు తోడు గ్రామస్థుల వేషభాషల్లో కూడా పెద్దమార్పు గోచరించిందతనికి. "నిన్నటివరకూ గోచీలతో తిరిగే పిల్లలు, తలవెంట్రుకల్ని జడగానైనా అల్లుకోడానికి

తెలియని ఆకవాళ్ళు ఇప్పుడు నాజూకు దుస్తుల్లో బయస్కో బొమ్మల్లా తిరుగుతున్నారే! ఒక్క రాత్రిలోనే వీళ్ళింతగా ఏలా మారిపోయారబ్బా" అనుకుంటూ సీనయ్య విస్మయ చేతస్కుడై పోయాడు.

ఊరిలోపల ప్రవేశించిన తరువాత సీనయ్య ఆశ్చర్య సముద్రంలోనే మునిగిపోవలసి వచ్చింది. పూరి కొంపల స్థానంలో వీధి కిరువైపులా చిన్న చిన్న మిద్దె యిండ్లు సాక్షాత్కరించాయ్. ప్రతి ఇంటికీ ప్రాకారపుగోడలు, పూలతోటలు, కొన్ని ఇండ్లలోనుంచీ గంధర్వగానం కూడా వినవస్తోంది. "అబ్బే యిది మన పెంటపాడు కాదు. దారితప్పి నేనేదో పట్నానికి వచ్చేశాను" అనుకుని సీనయ్య తన నాశ్చర్యంతో చూస్తూ నిలబడి వున్న ఒక యువకుణ్ని "పెంటపాడిక్కడికి ఎన్ని మైళ్ళుంటుందండీ" అని అడిగాడు. ఆ యువకుడు పకపకనవ్వి "ఓరి నీ అమాయకత్వం బండ్ల కెక్కించనూ, ఇదేనయ్యా పెంటపాడు" అని అక్కడినుంచీ వెళ్ళిపోయాడు.

సీనయ్య మరికొంచెం ముందుకు వెళ్లాడు. శ్రీరామచంద్రమూర్తి దేవాలయం యథాప్రకారంగా అక్కడే వుంది. దాని వెనుక రచ్చ, రాగిచెట్టు అలాగే వున్నాయ్. తూర్పుగా ఒక మైలు దూరంలో ఇనుప

దారిమీద రైళ్లు వస్తూ, పోతూవుండటం స్పష్టంగా కని పిస్తోంది. "ఇదే పెంటపాడు. ఇది పెంటపాడు కాక మరొకవూరు కావడానికి వీల్లేదు" అనుకున్నాడు సీనయ్య.

రచ్చదగ్గరనుంచీ అతడుమళ్లీ వూళ్లోకి వచ్చి తన ఇంటివైపు దారి తీశాడు కొంత కష్టంపైన ఇంటిని గుర్తించగల్గాడు. కానీ ఆ ఇల్లుకూడా మునుపటిలా లేదు. పైకప్పు పూర్తిగా చదలపాలైపోయివుంది. గోడలు కూలిపోవడానికి సిద్ధంగా వున్నాయ్. పైగా ఆఇంట్లో మానవులు నివసించే సూచనలైనా గోచరించ లేదు సీనయ్యకు. అతడు వరుసగా పెద్ద కొడుకునూ, చిన్నవాడినీ, భార్యని గొంతెత్తి పిలిచాడు. అతని పిలుపులకు ప్రత్యుత్తరంగా రెండు గబ్బిలాలు మాత్రం ఈ మూలనుంచీ, ఆ మూలకు పరుగెత్తినాయ్.

సీనయ్యకు దిక్కులు తోచలేదు. బడిపంతులు రామప్పయ్యను గనక విచారిస్తే ఈ మార్పుకు కారణ మేమిటో తెలియగలదని అతడువీథిబడి దగ్గరికి వెళ్లాడు. అక్కడకూడా తాటాకులపాకకు బదులు పెద్ద పెంకుటిల్లొకటి సీనయ్యకు ప్రత్యక్షమైంది. ఆ పెంకుటింటి గోడమీద "మహాత్మా గాంధీ విద్యాలయం" అని వ్రాయబడి వుంది.

విద్యాలయం ముందర నడివీధిలో తండోప తండాలుగా మూగిన జన సమూహం ముందు నిలబడి ఒక పెద్దమనిషి ఉపన్యసిస్తున్నాడు. ఆ ఉపన్యాసంలో "ఆంధ్రోద్యమం, విశాలాంధ్ర, ఆంధ్రరాష్ట్రం, పొట్టి శ్రీరాములు" మొదలైన మాటలెన్నో సీనయ్యకు విని పించినాయ్. కానీ ఉపన్యాస సారాంశం మట్టుకూ తెలియలేదు.

మాసిన గుడ్డలతో, పొడవైన గడ్డంతో, అందరివైపూ శూన్యంగా చూస్తూ నిలబడివున్న సీనయ్యను చూడగానే జనులందరూ అక్కడి ఉపన్యాసం జరుగుతున్న విషయం మరిచిపోయి అతని చుట్టూ మూగారు. ప్రశ్నలవర్షం కురిపించారు. "నువ్వు జైల్లో నుంచి పారిపోయి వచ్చావా?" అన్నారు. "నువ్వు చాలా కోపంగా వున్నట్టున్నావ్! నీ కాంధ్రోద్యమం పట్ల పూజ్యభావం లేదా?" అన్నారు. "అట్లా చూస్తే నువ్వాంధ్రుడివిగా తోచడంలేదు. ఆంధ్రుడివే ఐతే ఇలాటి శుభసమయంలో ఆనందపరవశుడివై పోయి వుండవలసింది" అన్నారు.

ఎవరికి తోచినమాటలు వారు మాట్లాడిన తర్వాత సీనయ్య "మీరేం మాట్లాడుతున్నారో నాకు అర్థం కావడంలేదు. నేనుకూడా మీ అందరిలా తెలుగువాడినే.

విశేషించి చెప్పాలంటే నేను రాజభక్తుణ్ణికూడా"
అన్నాడు.

"రాజేమిటీ, భక్తుదేమిటి? ఎవరయ్యా నీకు రాజు!" అన్నాడొకాయన. అయ్యయ్యో, ఆ మాత్రం కూడా తెలియనట్టు మాట్లాడుతారేమండీ! మనది హిందూదేశం కదా! ఈ దేశాన్ని పరిపాలించినరాజు ఇంగ్లాండుదేశంలో వున్నాడు. నేనాయన్ను గురించే మాట్లాడుతున్నాను" అన్నాడు సీనయ్య.

"ఓరి నీ అవివేకం చట్టుబండలు కానూ! నువ్వు చెబుతున్నది ఏనాటిమాట! మనకు స్వరాజ్యం వచ్చే ఏడేండ్లయిందే" అని విస్తుపోయా డొకాయన.

"స్వరాజ్యమా! వచ్చేసిందా? నేను నమ్మను, నేను నమ్మను" అన్నాడు సీనయ్య.

"నువ్వు నమ్మినా, నమ్మకపోయినా మనకు స్వరాజ్యమేమో వచ్చింది. ఇప్పుడు ప్రజా ప్రభుత్వం మనల్ని పాలిస్తోంది. అంతేకాదు. మనం చిరకాలం నుంచీ కోరుకుంటున్న ఆంధ్రరాష్ట్రంకూడా ఈ నెల ఒకటో తారీఖున అవతరించింది. అందుకే ఈ ఉత్సవం" అన్నాడొక వృద్ధుడు.

సీనయ్య తనకు మతిపోయిందేమో ననుకున్నాడు. లేక ప్రపంచమంతా తన కెదురు తిరిగి, ఒక

మాయానాటకాన్ని సృష్టించి, తన పాత్ర ఏదో తనకే తెలియని తనను అందులో చొప్పించి అపహాస్యం చేస్తున్నదేమోనని సందేహించాడు. కట్టకడను ఇక ఈ ప్రశ్నోత్తరాలతో లాభం లేదనుకొని తన వృత్తాంతం యావత్తూ వాళ్ళకో పూసగుచ్చినట్లు చెప్పేశాడు.

అంతా విన్న తర్వాత ఒక ముసలాయన "ఐతే నువ్వడవికి వెళ్ళింది నిన్న ఉదయమేనని నీకు బాగా జ్ఞాపకముందా?" అని ప్రశ్నించాడు.

"అయ్యో, లేకేమండీ! కావాలంటే నిన్నటి తేదీకూడా చెబుతాను ఎనిమిది అక్టోబరు. వెయ్యిన్నీ తొమ్మిది వందలా ముప్పయిమూడు" అన్నాడు సీనయ్య.

"ముప్పయిమూడో సంవత్సరమా! ఐతే ఇరవై ఏండ్లయిందన్నమాట! ఈ ఇరవై ఏండ్లు ఆ అడవిలో ఏంచేశావయ్యా" అన్నారు ఐదారుమంది ఒకేసారిగా!

"అబ్బే, మరేం చెయ్యలేదండీ. నిద్రపోయాను. ఐతే నేను నిద్రపోయింది మాత్రం ఒకే ఒక రాత్రని నా ఉద్దేశం" అన్నాడు సీనయ్య.

తరువాత ఒక నిముషంపాటు అక్కడ చేరిన జన సమూహంలో మౌనం నెలకొన్నది. వాళ్ళల్లో వాళ్ళ కెన్నో అనుమానాలు కలిగినాయ్. ఆఖరుకు

ఒక గ్రామస్తుడు ముందుకువచ్చి" పోనీ. నీ కీవూళ్లో తెలిసినవారెవరైనా వున్నారా?" అని అడిగాడు.

"లేకేమండీ! నీకప్పుడు నాకీవూళ్ళో అందరూ తెలిసినవాళ్ళగానే వుండేవారు. నా కుటుంబం ఇక్కడే వుండేది. భార్యా బిడ్డ లుండేవారు. వాళ్ళందరూ ఇప్పు డేమయ్యారో మరి! ఆ సందు వీధి చివరన, దేవా లయానికి ఎదురుగుండా పాడుపడిపోయిన పూరిల్లుంది చూచారా, అదే నా ఇల్లు" అన్నాడు సీనయ్య.

సీనయ్య తన ఇంటిని గురించి చెప్పి ముగించక మునుపే అక్కడున్నవాళ్లు పకాపక నవ్వి" మంచి వాడవేనయ్యా! అక్కడికొచ్చి, ఇక్కడికొచ్చి కడకు నీ కిక్కడొక ఇల్లుకూడా వున్నట్టు చెప్పేస్తున్నావ్! అంటలోనూ మా గోపులుగాడి ఇల్లే దొరికిందా నీకు?" అన్నారు.

"మీరే గోపులుగాణ్ని గురించి చెబుతున్నారో నాకు తెలియదు. నాకుకూడా గోపులు అని ఒక కొడు కుండేవాడు" అన్నాడు సీనయ్య.

"గోపులా! అదిగో వాడా చెట్టుకింద. చూడు వాడేనేమో నీ కొడుకు" అని ఎవరో అన్నారు.

ఇంచుక సమీపంలో ఒక చెట్టుక్రింద పడుకుని ముప్పయి ఏండ్ల యువకుడొకడు బీడీ త్రాగుతున్నాడు.

జనసమూహం నుంచి కొందరు వెళ్ళిఅతడిని బలవంతం గాలేపి సీనయ్య దగ్గరికి తీసుకొచ్చి" మళ్ళీ మీ నాన్న బ్రతికి వచ్చేశాడురా బాబూ" అని హేళన చేశారు.

"మా నాన్నేమిటి బ్రతికి రావడమేమిటి? ఆయన ఇరవై ఏళ్ళ క్రితం ఇల్లువిడిచి పరారై పోయాడు. నదిలో మునిగిపోయాడని కొందరూ, ఏదో రైలుప్రమాదంలో మరణించాడని కొందరూ చెప్పారు. మా నాన్న ఇల్లు విడిచిపెట్టి వెళ్లిన మరునాడే ఆయన పెంపుడుకుక్క తిరిగివచ్చేసింది'' అని గోపులు చెబుతుండగా సీనయ్య అడ్డువచ్చి "ఆ కుక్క పేరు భైరవే కదూ'' అన్నాడు. గోపులు "అవును, దాని పేరు భైరవే. కానీ అదికూడా ఎప్పుడో చచ్చిపోయింది'' అన్నాడు.

ఎన్నో ప్రశ్నలడగాలనుకున్నప్పటికీ అన్నిటినీ ఒకేసారి అడగలేక "పోనీ, మన రాముడెక్కడ?" అని ప్రశ్నించాడు సీనయ్య. ఈ ప్రశ్నకు గోపులు సమాధానం చెప్పలేదు. మరెవరో చెప్పారు. నలభై రెండు ఆగష్టు ఉద్యమంలో రైళ్ళను నిలిపి, తంతి కమ్ముల్ని తెగ్గొట్టి గొప్ప విప్లవ వీరుడుగా పేరెన్నిక గన్నాడట! స్వరాజ్యం వచ్చిన తర్వాత కూడా వాడు ఊళ్ళోరా సేవాసమితుల్ని నెలకొల్పుతూ దేశంపైన

తిరుగుతున్నాడట! పెంటపాడు గ్రామస్తులకు అతని పేరు అప్పుడప్పుడు పేపర్లలో మాత్రం కన్పిస్తుందట!

సీనయ్య మరొక్క ప్రశ్నను చాలా కంగారుగా అడిగాడు. "ఐతే గోపులూ, మీ అమ్మ ఏమైంది?"

గోపులు నిశ్చింతగా సమాధానం చెప్పాడు "ఆమె చనిపోయి రెండేళ్ళయింది"

సీనయ్య ఒక వేడినిట్టూర్పు విడిచాడు!

ఇంతలో ఆ వూరికల్లా వృద్ధులైనవారైన దా రుగు రక్కడికి వచ్చి, ఎన్నెన్నో పరీక్షలు చేసి కడకు "ఇతడే సీనయ్య" అని నిర్ధరించారు. ఆ ప్రాంతం లోని అరణ్యాల్లో కొన్ని ధాతువులు కలకాలంగా నివ సిస్తున్నాయనీ అవి త్రాగే మద్యాన్ని ఆస్వాదించే మానవుడు సంవత్సరాల తరబడి గాఢనిద్రలో వుండి పోవడం సహజమే నని ఒక వృద్ధుడు ఎన్నో తార్కా ణాలతో సహా వివరించి చెప్పాడు.

సీనయ్యయొక్క దీర్ఘ నిద్రకు ఇదే కారణ మని అందరికీ నమ్మకం కలగేటట్టు ఎవరూ చెప్పలేక పోయినా, గయ్యాళి భార్యలతో కాపురం చేసే గృహ స్థులు మాత్రం సీనయ్యకు దొరికిన ధాతువు సేవించే మద్యం తమకుకూడా దొరికితే ఎంతో బాగుంటు న్ను కున్నారు.

• [ఆధారం : వాషింగ్టన్ ఇ]

నీలకంఠంతోబాటు కాశీయాత్రకు వెళ్ళదలచుకున్న మరొక వృద్ధుడు, అతడిలా అంతపేరు ప్రతిష్ఠలు కలిగినవాడుకాదు. అతనిది అతి సామాన్యమైన కుటుంబం. ఊరిచివర పూరిగుడిసెలో అతని కాపురం. గుడిసెప్రక్కన వేపచెట్టు క్రింద కొయ్యపనిచేస్తూ, అతడు జీవితంలో చాలాభాగం గడిపేశాడు. కుమారుడు ప్రయోజకుడై, బాడిత చేతబట్టుకున్న తర్వాత అతడా పనికికూడా స్వస్తిచెప్పి, ఊళ్ళో అందరి కష్టసుఖాల్లోనూ పాలు పంచుకోసాగేడు. ఒకరికి జ్వరంవచ్చినా, మరొకరికి తేలుకుట్టినా, ఇంకొకరికి ఇంకొక కష్టమేదైనా వచ్చినా తక్షణం దాసుకు పిలుపు తగిలేది. దాసు వైద్యుడు కాకపోయినా, అతడి బ్రతుకంతా రోగులకు సపర్యలు చేయటంతోనే గడచిపోయింది గాబట్టి, అతడి సలహాలు క్రొత్తవైద్యుల మందులకన్నా ఎక్కువగా గుణాన్నిచ్చేవి.

దాసు ఆదినుంచీ జబ్బు మనిషి. వయసు యాభై దాటకపోయినా అతడి ముఖాన ముడతలు కనిపిస్తాయి. కళ్ళల్లో వెలుగుండదు గానీ, పెదవులపైన చిరునవ్వుమాత్రం అతడిని విడిచిపెట్టదు. దాసుకీ, నిద్రాహారాలకీ అంత సంబంధం ముండేదిగాదు. ఏ మిట్టమిధ్యాహ్నమప్పుడో పళ్ళుదోముకుని తిన్నశాస్త్రం

ముగించేవాడు. ఏ అర్ధరాత్రప్పుడో అరుగుమీద ఒరిగి, వేగుచుక్కతోనో, కోడికూతతోనో లేచి 'ఏ తీరుగ నను దయజూచెదవో ఇనవంశోత్తమ్మ రామా !' అంటూ త్యాగయ్యగారి కీర్తనతో ఇరుగు పొరుగు వాళ్ళందరికీ మేలుకొలుపులు పాడేవాడు. మూలగదుల్లో పడుకున్న అత్తగార్లు "అదెగో దాసు కీర్తన పాడుతున్నాడు. మీకింకా తెల్లవారలేదూ! లేవండి, లేవండి" అని కోడళ్లని లేవగొట్టేవారు. నిజం చెప్పొద్దూ! అతడలా పాడు తుంటే ఊళ్లో కోడళ్ళకు మాత్రం మహా చిరాకుగా వుండేది.

అసలు కాశీయాత్రకు బయల్దేరాలని, నీలకంఠమూ దాసూ కూడబలుక్కున్న తర్వాతగూడా ఏడెనిమిదేండ్లు గడచిపోయాయి. నిజానికి నీలకంఠానికి కాశీయాత్రచేసి రాదగినంత ఎడతెరపి చిక్కడం ఈ జన్మలో సాధ్యం కాదేమోనని కూడా దాసు అనుకున్నాడు. నీలకంఠానికి ఒక పని చేసి ముగించేలోపల మరొక పని కాసుకుని వుండేది. కుమారుడి పెళ్లి, అది అయిన తర్వాత మామిడితోటలో బావి త్రవ్వకం. ఆ పని పూర్తికాగానే మనుమడి బారసాల! ఆ శుభకార్యం కాస్తా జరిగిపోగానే నీలకంఠానికి మరొక పెద్ద పని తగిలింది. ఎప్పుడో తాతముత్తాతలు కట్టించిపోయిన

పెంకుటిల్లు కాపురానికి చాలదని దానిప్రక్కన ఒక మేడ కట్టించడంలో అతడు నిమగ్నుడై పోయాడు.

ఒకానొక పండుగదినాన దాసు నీలకంఠం ఇంటికి వెళ్ళి అరుగుపైన కూర్చున్నాడు.

"ఏం దాసూ! చూస్తున్నావు గదూ, నా బ్రతుకంతా సంసారం గొడవలతోనే గడచిపోతోంది. ఎప్పుడు తీరిక చిక్కుతుందో, ఎప్పుడు మన యాత్ర కొనసాగుతుందో" అని నిట్టూర్పు విడిచాడు నీలకంఠం.

"పనులేమో ఎల్లకాలమూ వుంటాయి. ఆ సాకుతో మనం ఆలస్యంచేస్తూ కూచుంటే ఎలాగు? ఈ సంవత్సరం ఎండలుకూడా అమితంగా లేవు, యాత్ర చేయడానికి ఇది అనుకూలమైన కాలం" అన్నాడు దాసు.

"అవుననుకో! కానీ గోడలు కట్టడంమాత్రమే ముగిసిన ఈమేడగతి?" అని తన సమస్యని వెలిబుచ్చాడు నీలకంఠం.

"అదేమిటయ్యా నీలకంఠం! మీఇంట్లో నువ్వు తప్ప మరెవరూ లేనట్టు మాట్లాడుతావేమిటి? వాళ్లు చూచుకుంటారు."

"ఏం చూచుకుంటారో! మావాడి సంగతి నీకు తెలియదా దాసూ! వట్టి దుబారా మనిషి. వాడికి ఇల్లు గుల్లచేయడం తప్ప మరేమీ తెల్వియదు దాసూ!"

"ఎందుకు తెలియదు! మనం కళ్లుమూసు కుంటే ఆ తరువాతైనా తెలుసుకోవాలిగదా! ఇప్పటి నుంచే తెలుసుకోనివ్వు మరి!"

"నిజమే, నిజమే! కానీ దాసూ, మమకారం గొప్పది కదూ! ఈ పనిమాత్రం నా చేతులమీదగానే పూర్తికానీ, ఆతరువాత ఆలోచిద్దాం."

"పూర్తయ్యే దెప్పటికి నీలకంఠం! ఈరోజు పండుగగదా! ఇల్లలకాలి, ముగ్గులు పెట్టాలి, వంట చేయాలి, పొంగళ్లున్నాయి అని ఇంట్లో తెల్లవారినుంచీ ఆడవాళ్ళది ఒకటే హడావుడి. ఈ పండుగ అనేది అన్నిరోజుల్లోలాగానే మామూలుగా వెళ్ళిపోతుందిగానీ, కొంపదీసి ఇదే శాశ్వతంగా వుండేటట్టయితే పనులు చేయలేక మన ప్రాణాలు నిలువునా ఎగిరిపోయేవేమో!" అన్నది నా కోడలు. ఆ అమ్మాయి కాస్త చదువుకున్న బాపతులే" అన్నాడు దాసు.

నీలకంఠం కొంతసేపు ఆలోచించాడు.

"ఐనా కాశీ యాత్రంటే వట్టిమాటల్తో అయ్యే పనా దాసూ! డబ్బు కావాలిగదా! మెల్లమెల్లగా పైకం కూడబెట్టుకోవాలి."

దాసు నవ్వాడు.

"ఇదేం తమాషా నీలకంఠం! ఊళ్లో నీకంటే డబ్బు కలిగినవాళ్లెవరున్నారు! నేను నిజానికి ఒక పకీరునే అనుకో! కానీ నేను పైకం ప్రోగుచేసుకోవాలని సాకుచెప్పడం లేదు. ఎంతో కొంత డబ్బు నా దగ్గరా వుంది. లేనిపోని మాటలెందుకు? ఎప్పుడు బయల్దేరుదామో చెప్పు."

"సరే, తప్పుతుందా దాసూ! వెళ్దాములే మంచి రోజు చూచుకుని" అన్నాడు నీలకంఠం.

ఆ రాత్రి నీలకంఠం ఆలోచించీ, ఆలోచించీ ఒక నిర్ణయానికి వచ్చాడు. ఆ మరునాటి వుదయమే అతడు దాసును కలుసుకున్నాడు.

"మనం నాలుగైదు రోజుల్లో ఖండితంగా బయల్దేరబోతున్నాం దాసూ! చావుబ్రతుకులు మన చేతుల్లో లేవు. దీప మున్నప్పుడే ఇల్లు చక్కబెట్టుకోవాలి. మన శరీరాల్లో సత్తువ చావకముందే వెళ్లి వచ్చేద్దాం."

అనుకొన్నట్టు ఆ ఇద్దరూ యాత్రకు సంసిద్ధులయ్యారు. దాసు తన చిరకాలంనుంచీ పోషించుకుంటూ వచ్చిన గొఱ్ఱెలమందని అమ్మాడు. పెరుగు, నెయ్యి అమ్మి అతడి భార్య ముంతలో దాచి వుంచిన

డబ్బు అక్కరకు వచ్చింది. యాత్రా సమయంలో డబ్బుతో ఎంతో అవసరముంటుందని కోడలు అమ్మ గారింటినుంచీ అప్పుడప్పుడూ తెచ్చుకున్న పైకాన్ని గూడా మామగారి ఒడిలో పోసింది. దాసు కొడల్ని ప్రేమతో చూచుకోమని భార్యని మందలించి, తల్లిపట్ల వినయ విధేయతలతో మెసలెమని కొడుక్కి హితవు చెప్పి యాత్రకు బయల్దేరాడు.

నీలకంఠం ప్రయాణం మాత్రం అంత సాఫీగా ప్రారంభం కాలేదు.

కొడుకు చేతికి ఇనప్పెట్టె తాళాలిచ్చి, వడ్డీలు వసూలుచేసుకోడంలో గుట్టుమట్లన్ని బోధించి, పొలాల్లో స్వంతంగా చేసుకోవలసిన వేవో, కౌలు కివ్వవలసిన వేవో వివరించి, ఎలాగైతేనేం ఇంటిని వదల్లేక, వదల్లేక హృదయాన్ని అక్కడే వదలి..శరీరాన్ని మాత్రం ఈడ్చుకుంటూ బయల్దేరాడు.

దాసు నిశ్చితంగా ప్రయాణం సాగించాడు. అతడి మనసు దైవచింతతో నిండిపోయింది. అతడు ప్రాపంచిక విషయాలను బొత్తిగా మరచిపోయాడు. దైవ భక్తితో తరించిపోయిన యోగుల గాథల్ని మననం చేసుకుంటూ అతడు నడువ సాగేడు.

నీలకంఠం మనసులో ఏవేవో వేదనలు అల్లి బిల్లిగా అల్లుకోసాగేయి. ఇంట్లో తన కుమారుడు తను చెప్పివచ్చినట్టు నడచుకోవడం లేదేమో! విచ్చల విడిగా డబ్బును వెదజల్లుతున్నాడేమో. రహదారి పక్కన పొలాల్లో గిత్తల్ని అదలిస్తూ రైతులు మడక దున్ను తున్నారు. మరి తన కుమారుడు అలా పట్టుగా పొలం దగ్గరుండి సేద్యం చేయిస్తున్నాడో లేదో! అయ్యో, తను ఇంటికి తిరిగి వెళ్ళిపోతే ఎంతబాగుండును!

ఐదువారాలు గడిచిపోయాయి. త్రోవపొడుగునా దేశం సస్యశ్యామలంగా వున్నందువల్ల, ఎక్కడ పడితే అక్కడ అన్న సత్రాల్లో బాటసారులకు భోజన సౌక ర్యాలు లభిస్తున్నాయి. అదీగాక, గృహస్థులు అతిథుల్ని అభాగ్యుల్ని సత్కరించడమే ఒక భాగ్యంగా తలపోసి మురిసిపోతున్నారు.ఆతిధ్యమర్యాదల కింత పేరుమోసిన దేశంలోవుండిగూడా, ఇంతవరకూ పుణ్యక్షేత్రాలకు వెళ్ళిరాకపోయినందుకు దాసు చాలా విచారించాడు.

వెలుగుప్రక్కనే చీకటి వుంటుంది. మరికొంత దూరం పయనించిన తర్వాత యాత్రికులిద్దరూ కరవు కాటకాలతో సతమతమైపోతున్న ఒక గుట్టల పుట్టల మెట్ట ప్రాంతంలో ప్రవేశించారు. అక్కడున్న

వాళ్లందరూ కలబంద గడ్డలతోనూ, దేవదారు ఆకుల తోనూ కాలం గడుపుకుంటున్నారు. కనుచూపు మేరకూ పొలాలు ఎండి నెర్రలు పడివున్నాయి. నీళ్ళ కోసం వెదుక్కుంటూ కాకులు మండుటెండల్లో ఎక్కడికో ఎగిరిపోతున్నాయి.

దుర్భిక్షదేవత వీరవిహారం చేస్తున్న ఆ ప్రదేశంలో కూడా కొందరు మానవులు ఇంకా తమ ఇళ్లనే అంటిపెట్టుకుని, పస్తులుతోమాడుతుండడం జూచి దాసు ఆశ్చర్యపడ్డాడు. 'దానికి మనమేం చేద్దాం! అంతా వాళ్ళ వాళ్ళ ప్రారబ్ధం' అని ఊరుకోడం నీలకంఠానికైతే చెల్లింది గాని, దాసు అలా అనుకోలేకపోయాడు. 'ఒకవేళ చేసివుంటే ఏ ఒకరిద్దరో పాపాలు చేసివుండవచ్చు. లక్షలాది ప్రజానీకానికి ఈ శిక్ష ఏమిటి?' అని దాసు లోలోపల విహ్వాలించిపోయాడు.

ఒకరోజు వుదయం నీ రెండలో దేశం భగభగలాడిపోతోంది. నీలకంఠం సూర్యుడునడినెత్తి మీదికి వచ్చేసరికి దాపునవున్న బస్తీకి చేరుకోవాలన్న పట్టుదలతో నడుస్తున్నాడు. దాసు వెనుకపడ్డాడు. అతనికి మొదటనుంచి నస్యం వేసే దురలవాటొకటుంది. డబ్బిలో నస్యం ఖాళీగావడం మూలాన అతనిలో ఉత్సాహం క్రమేపీ సన్నగిల్లిపోసాగింది. అందుకు

తోడూ, నాలుక పిడచ గట్టుకునిపోయి, గుక్కెడు మంచినీళ్లు గొంతుకవెంట దిగజారకపోతే శోష తగుల్తుందేమోనన్నభయం కూడాఅతనికి కలుగజొచ్చింది.

నీలకంఠం వెనుదిరిగి చూచి "అబ్బే, ఏమిటిది దాసూ! ఇలాగైతే మనం కాశీ చేరుకోడం కలలోని మాట! ఐనా అదేం నడవడం! నువ్వు చీమల్తో పందెం వేస్తున్నావులా వుంది" అన్నాడు.



"నీళ్లు త్రాగాలి నీలకంఠం! మంచినీళ్ళ" అన్నాడు దాసు.

"అదిగో, అక్కడేదో ఊరున్నట్టుంది, త్రాగిరా. నేనా చెట్టుక్రింద వుంటాను" అన్నాడు నీలకంఠం.

"ఎందుకులే నీలకంఠం! నువ్వు మెల్లగా నడుస్తూ వుండు. నేను నిన్ను కలుసుకుంటాను" అన్నాడు దాసు.

నీలకంఠం రస్తావెంబడి నడువసాగేడు. దాసు కాలిబాటలోబడి చింతచెట్ల మధ్య కనిపిస్తున్న పల్లెటూరికి దారితీశాడు.

పది తాటాకు కొంపలు మాత్రమే బిక్కు బిక్కుమంటున్న ఆ పల్లెలో రచ్చబండదగ్గర నిలబడి దాసు వీధంతా కలయజూశాడు. మచ్చుకైనా ఒక మనిషి కనిపించడం లేదు. కొట్టాల్లో గొడ్లు లేవు. ఇళ్ళల్లో కూడా మనుషులున్న సవ్వడి వినిపించడంలేదు. దాసు మెల్లగా ఒక గుడిసెదగ్గరికి వెళ్లాడు. మూసివున్న తలుపు లోపలికి తోశాడు. లోపల గడియలేదు. తలుపు కిర్రుమని శబ్దంచేస్తూ తెరుచుకుంది. దాసు రెండడుగులు ముందుకు వేశాడు.

ఆ ఇంట్లో ఎక్కడి సామానులక్కడ చిందర వందరగా పడివున్నాయి. ఒకమూల కుక్కి మంచం పైన ముసలావిడ ఒకతె ఉబ్బసంతో కొలిమితిత్తిలా

బుసలు కొడుతూ పడుకునివుంది. మంచం కోడుదగ్గర రెండేళ్ళ కుర్రాడు ఏడవడానికి శక్తి లేకపోయినా, ఏడవడం తప్ప మరి చేయగలిగిందిలేక వెక్కి వెక్కి ఏడుస్తున్నాడు.

"అమ్మా" అని దాసు పలకరించాడు. ముసలావిడ కళ్ళు తెరచి "ఎవరు నువ్వు? ఏం కావాలి? ఇక్కడేమీ దొరకదు. వెళ్లు, వెళ్లు" అని మళ్ళీ కళ్లు మూసుకుంది.

"మరేమీ వద్దమ్మా! మంచినీళ్ళు కావాలి" అన్నాడు దాసు.

"మంచినీళ్ళా! ఎక్కడున్నాయి! బిందె బుజాన పెట్టుకుని ఒకగడియసేపు నడిస్తే బావిదగ్గరికిపోవచ్చు. ఒక్క ఝాము సేపక్కడుండి ఊరనిచ్చి, చేదుకుంటే ఒక దుత్తెడు నీళ్లు దొరుకుతాయ్. ఆ నీళ్ళకోసం నీకంటే ముందుగా వెళ్లిన వాళ్లు యాభైఆరుమంది అక్కడ పడిగాపులు పడివుంటారు. ఎవర్ని పొమ్మంటావ్! ఎలా తెమ్మంటావ్! అలా పెరటివైపుకు వెళ్లి చూడు, ఎండిపోయిన మల్లె పందిరిక్రింద అబ్బాయి పడివున్నాడు. వాడు బాగున్నంతవరకూ మమ్మల్ని ఏలాగోలాగు కాపాడుకొచ్చాడు. వాడు పడిపోయాడు.

వాడికంటే ముందు మేము పడిపోయాము. ఇంకే ముంది? అంతా అయిపోయింది! ఒగర్పు అధికం కావడంవల్ల ముసలావిడ మరిమాట్లాడలేకపోయింది.

దాసు పెరట్లోకి వెళ్లాడు.ముసలావిడ చెప్పి నట్టు అక్కడ ఎండిపోయిన మల్లె పందిరిక్రింద ముప్ఫయి యేళ్ళయువకు డొకడు చొంగలు కార్చు కుంటూ పడివున్నాడు.

"దాసు అతడిదగ్గర కూర్చుని బాబూ! కళ్ళు తెరువు! ఇంట్లో పడుకోకూడదూ!" అన్నాడు.

యువకుడు కళ్ళు దెరచి ఎదుటవున్న మని షెవరో తెలియక "ఎవరూ? ఏమంటున్నారు?"అన్నాడు.

"నేనెవరినైతే ఏంలేబాబూ! నీకు ఒళ్ళు జబ్బు చేసి ఎన్ని రోజులయింది? మందు తీసుకోకూడదూ?" అన్నాడు దాసు.

"మందిచ్చేవాళ్లెవరున్నారు? పదిరోజులనుంచీ జ్వరం కాస్తూనే వుంది. నేనిక్కడ పడిపోయింది నిన్ననో మొన్ననో సరిగ్గా జ్ఞాపకంలేదు" అన్నాడు యువకుడు.

దాసు మెల్లగా అతణ్ణి లేవదీసికెళ్లి ఇంట్లో పండబెట్టాడు. దుత్త, త్రాడు పట్టుకెళ్లి నీళ్ళు తోడి

తెచ్చాడు. అప్పటికే మధ్యాహ్నం దాటింది. తనవెంట దెచ్చుకున్న మూటలోనుంచి రొట్టెముక్కలు పైకితీసి ముసలావిడకు తినిపించాడు. రొట్టెల్ని చూడగానే కుర్రాడికి ప్రాణం లేచి వచ్చినట్లయింది. జ్వరంతో బాధ పడుతున్న యువకుడుమాత్రం ఆ రొట్టెనుకూడా నమిలి తినలేకపోయాడు. దాసు పొరుగూరికి వెళ్లి అంగడిలో బియ్యము, నూకలు కొనితెచ్చి మొదట నూకలతో గంజి కాచాడు. వేడిగా రెండుగుక్కల గంజి గొంతుక వెంట దిగజారగానే ఆ యువకుడి ముఖంలోకూడా ఇంచుక జీవకళ తారాడసాగింది. రొట్టెల్ని తిన్న తర్వాత కుర్రాడు ఏడుపుమాని నిద్రపోయాడు. ప్రొద్దు పడమటి కొండమాటున మాటుమణిగేసరికి ముసలావి డకుకూడా ఉబ్బసం కొంత తగ్గింది.

"నువ్వెవరివో మాకు తెలియదు. దేవుడే నిన్ను మా దగ్గరికి పంపించి నట్టున్నాడు. నువ్వుగనుక ఈ రోజు ఆదుకోకపోయివుంటే ఈపాటికి మేమిలా వుండే వాళ్ళంకాము. నీ బిడ్డలు చల్లగా వుండాలి! నువ్వు నూరేండ్లుపాటు బ్రతకాలి" అని ముసలావిడ గోడకు చేరగిలబడి దాసుపైన దీవనలు కురిపించసాగింది.

"మనుషులమై పుట్టిన తర్వాత ఒకరికొకరు సాయం చేసుకోకుంటే ఎలాగమ్మా! అదలా వుండనీ

గానీ ఈ కుర్రవాడి తల్లి ఏమైంది" అని ప్రశ్నించాడు దాసు.

దాసు తీగెను మాత్రమే కదిపాడు. దానితో డొంకంతా కదిలింది.

అది బాగాబ్రతికి, చెడి చితికిపోయిన కుటుంబం, ఆ ముసలావిడ పేరు సీతమ్మ. సీతమ్మకు నలుగురు కొడుకు లుండేవారు. అందులో ఇద్దరు దండుకువెళ్ళి తిరిగిరాలేదు. ఒకణ్ని నాలుగేళ్ళకు ముందు వచ్చిన మహామ్మారి తనవెంట దీసుకెళ్లింది. నాలుగు స్తంభాల మేడలో మూడు స్తంభాలు విరిగిపోయాయి. ఒకటి మాత్రం మిగిలింది. ఆ ఒకడికి సీతమ్మ తన మేనకోడల్ని తెచ్చి పెళ్లి చేసింది. 'కామమ్మ రాగానే కరువొచ్చినాది' అన్నట్టు కోడలు ఇంట్లో కాలు బెట్టిన సంవత్సరమే వానల్లేక, చెరువులెండి బావుల అట్టడుగున పచ్చిక మొలిచింది. తరువాత వరుసగా ఆరేళ్లు కరువు. కరువులోనే కోడలు కడుపున కాయ గాచింది. కుర్రాడికి పురుడు దీరక ముందే తల్లికి జన్ని తగిలి, ఇంట్లో పుట్టెడు దుఃఖాన్ని నిలిపి పరలోకం జేరుకుంది. కోడలు చావుతో ఇల్లు వల్లకాడులా తయారై కూచుంది. అప్పటినుంచీ ఉబ్బసం ఎక్కువై సీతమ్మ మంచం పట్టింది. అక్కడా, ఇక్కడా కూలీ నాలీ చేసి

తెచ్చే డబ్బులతో బ్రతుకసాగక, వేళకు సరిగా తిండి లేక ఆమె కొడుకు కృంగి కృశించిపోయాడు. అతనికి జ్వరం రావడంతో పరిస్థితి మరింత విషమించింది. ఇరుగు పొరుగున వున్నవాళ్ళ జీవనంకూడా యిందుకు నకలుగానే వున్నందువల్ల పైనుంచీ ఎలాటి సాహాయమూ లభించడానికి ఆస్కారం లేకపోయింది.

బరువెక్కిన హృదయంతో దాసు ఆ దుఃఖ గాథ విన్నాడు. వింటూ తన కాశీయాత్ర మార్గ మధ్యంలోనే ఆగిపోయిందన్న విషయాన్ని తాత్కాలికంగా మరచిపోయాడు. ఈ కుటుంబం ఎలా గట్టెక్కుతుంది? ఆ అబ్బాయికి జబ్బు నయం గాకపోతే ఆ కుర్రాడి గతేమిటి? ఈ ప్రశ్నలకు జవాబు చెప్పుకోలేక దాసు తల్లడిల్లి పోయాడు.

ఆ మరునాటి వుదయం దాసు పొరుగూరికి వెళ్ళి జ్వరం నయమైనట్టయితే ముప్ఫయి రూపాలిచ్చే షరతులతో వైద్యుణ్ణి తీసుకొచ్చాడు. వైద్యుడు మందిచ్చి రోగికి పాలుపండ్లు తప్పా మరేదీ యివ్వగూడదని పథ్యం పెట్టాడు. పండ్లకోసం దాసు బస్తీకి వెళ్ళి వచ్చాడు. వారం రోజుల్లో ఆ యువకుడు తేరుకొని, లేచి నడవసాగేడు. ముసలావిడ వేళకు పట్టెడన్నం తిని వంటా వార్పు చేసుకోసాగింది.

దాసుకు స్వవిషయం ఆలోచించుకోడానికి తీరిక చిక్కింది. నీలకంఠం ఈ పాటికి చాలా దూరం వెళ్లి వుంటాడు. ఇక తను అతణ్ణి మార్గంలో కలుసుకోడం సాధ్యపడదు. తెచ్చుకున్న డబ్బులో ముప్పాతిక వంతు వైద్యుడి క్రింద, మిగతా ఖర్చుల క్రింద దఖలు పడి పోయింది. ఇంక తనేం చేయాలి? ఊరికి తిరిగి వెళ్లి పోవడంకన్నా గత్యంతరం ఏముంది!

"ఓరి నిర్భాగ్యుడా, దాసూ! ఈ జన్మలో నీకు విశ్వేశ్వరుణ్ని సందర్శించుకునే భాగ్యంలేదు! నువ్వదృష్ట హీనుడివి, ఏం చేస్తావుమరి? తిరిగి వెళ్ళిపో" అని దాసు తనలో తానే అనుకున్నాడు.

ఆ ఏడెనిమిది రోజుల్లో దాసుకు ఆ కుటుంబంతో త్రెంపరాని ఆత్మీయత ఏర్పడింది. దాన్ని ఛేదించుకుని ఆవల పడడం ఎలాగని అతడు ఆలోచించాడు. వాళ్లు తనని వెళ్ళనివ్వరు తనింక అక్కడుండి వాళ్ళకు చేయగలిగే మేలేమీ వుండదు. తెలియకుండా వెళ్లి పోవడమే మంచిది. ఈ నిర్ణయానికి వచ్చిన దాసు ఒక అర్ధరాత్రివేళ అందరూ నిద్రపోతున్నప్పుడు మెల్లగా తలుపుతీసుకుని ఈవలికి వచ్చి స్వగ్రామాభిముఖుడై నడువసాగేడు.

ఒంటరిగా మరలివచ్చిన దాసుని చూచి ఊళ్లో అందరూ విస్తుపోయారు "నీలకంఠం రాలేదేం! ఏమయ్యాడు?" అని ప్రశ్నించారు. "మార్గమధ్యంలో మేము విడిపోయాం. నీలకంఠం ఈపాటికి కాశీనగరం చేరుకునివుంటాడు. అనుకోని ఖర్చులు కొన్ని తగలడం వల్ల నా డబ్బు సగందూరం వెళ్లేసరికే అయిపోయింది. అందుచేత ప్రస్తుతానికి యాత్ర మానుకుని తిరిగి వచ్చేశాను" అన్నాడు దాసు.

*　　　*　　　*

దాహశాంతికోసం దాసు రహదారి ప్రక్కన వున్న పల్లెటూరికి వెళ్లినరోజున నీలకంఠం సాయంత్రం వరకూ అతడికోసం ఎదురు చూచాడు. ఎంతకూ దాసు వచ్చి అతణ్నికలుసుకోలేదు. ఆ రాత్రి నీలకంఠం ఆ ప్రాంతంలోవున్న బస్తీలో ఆగి, తెల్లవారగానే లేచి దాసు తన వెనుకనే వచ్చి ఎక్కడైనా వేచివున్నాడేమోనని ఊరంతా వెదికాడు. కొందరు బాటసారుల్ని వాకబుచేశాడు దాసుజాడ చెప్పినవాళ్లెక్కరూ లేరు. ఒకవేళ దాసు మరొక దారిగుండా ముందుకు సాగిపోయాడేమోనని నీలకంఠానికి ఒక సందేహం కలిగింది. "ఎలా పయనించినా గమ్యస్థానం మొకటేగదా! అక్కడైనా కలుసుకోకపోతామా?" అనుకుని అతడు

ఒక యాత్రికుల జట్టుతో కలసి మళ్ళీ ప్రయాణం చేయసాగేడు.

రెండువారాలు పయనించిన తర్వాత ఆ యాత్రికులందరూ కాశీ నగరంచేరుకున్నారు. సర్వపాపాల్నీ నివారించే గంగానదిలో మణికర్ణిక, పంచగంగ, వరుణ, కేదార మొదలైన స్నానఘట్టాల్లో గ్రుంకులిడి ప్రయాణ శ్రమను తీర్చుకున్నారు. విశ్వనాధుని ఆలయాన్ని ముమ్మారుప్రదక్షిణం తిరిగి, జట్లు జట్లుగా గర్భగుడిలో ప్రవేశించారు. వేయి దివ్వెల వెలుగులో విశ్వనాధుని లింగమూర్తి కనులవిందుగా వాళ్ళకు ప్రత్యక్షమైంది.

నీలకంఠం ఎంతో ప్రయత్నించాడుగానీ జనాన్ని తోసుకుని మరింతముందుకు పోలేకపోయాడు. కొంత దూరంలోనే నిలబడి విశ్వేశ్వరుణ్ణి దర్శించి, తనయాత్ర సఫలమైనందుకు కలిగిన ఆనందాతిరేకంచేత మేను మరచిపోయాడు. 'ఈ సమయంలో దాసుకూడా ఇక్కడ వుంటే ఎంతబాగుండేది! అతడు దురదృష్టవంతుడు. పుణ్యంచేసి పుట్టినవాళ్ళకి మాత్రమే విశ్వనాధుని దర్శనం దొరుకుతుంది' అనుకున్నాడు. అతడలా అనుకుంటూ వుండగానే ఒక విచిత్రం జరిగింది. నీలకంఠం తన కళ్ళను తానే నమ్మలేకపోయాడు. ఇది కలగాదుగదా అని కళ్ళు నులుముకున్నాడు. అది కల

గాదు, యథార్థమే! మూలవిరాట్టుకు చేరువగా, వేద విహితంగా ధూపదీపహారతుల్ని జరుపుతున్న అర్చకుని కంటే దగ్గరగా దాసు నిలబడి వున్నాడు!

నీలకంఠం గొంతెత్తి దాసుని పిలవబోయాడు. కాని గొంతు పెగల్లేదు. దాసు ఎప్పుడువచ్చినట్టు? తన కంటే ముందుగా ఏలా రాగలిగేడు? ఎలాగో వచ్చాడని సరిపెట్టుకున్నప్పటికీ, తనకూ విశ్వేశ్వరుడికి ఏ జన్మాంతర సంబంధమో వున్నట్టు అంత చేరువగా ఎలా నిలబడగలిగాడు?

నీలకంఠం యాత్రికులతోబాటు బయటికి వచ్చి, ఆలయ ప్రాంగణంలో దాసు రాకకోసం ఎదురు చూచాడు. ప్రొద్దుపోయింది. సంధ్యాసమయాన జరుగవలసిన పూజలన్నీ యథావిధిగా జరిగిపోయాయి. అర్చకులు బయటికి వచ్చి తలుపులు మూసివేశారు. కానీ దాసు మాత్రం బయటికి రాలేదు.

నీలకంఠం పదిరోజులపాటు కాశిలో వుండిపోయాడు. అన్నపూర్ణ అన్న పేరుతో ప్రఖ్యాతి కెక్కిన విశాలాక్షిని, సాక్షి వినాయకుణ్ణి దర్శించాడు! గంగాజలాన్ని ఒక పాత్రలో పదిలపరచుకున్నాడు. యాత్రికులతో కలసి స్వగ్రామానికి బయల్దేరాడు.

మార్గమధ్యంలో తనూ, దాసు విడిపోయిన చోట ఆగి, ఆ పల్లెటూరికి వెళ్ళి నీలకంఠం దాసుని గురించి వాకబుచేశాడు. సీతమ్మద్వారా కొంత విషయం తెలిసింది. "అతడొక రోజు వుదయం వచ్చాడు. రెండు వారాలపాటు మా యింట్లో వుండి కష్ట సమయంలో మాకు సాయపడ్డాడు. తరువాత అత డెలా వచ్చాడో, అలానే వెళ్ళిపోయాడు. అతడు మనిషి కాడు బాబూ! మనిషైతే అతడికి మాపైన అంత దయెందుకుంటుంది? మనిషైతే వెళ్ళేప్పుడు ఒక మాటైనా చెప్పిపోడా! ఒక అర్ధరాత్రివేళ ఉన్నట్టుండి మాయమైపోయాడు." సీతమ్మ యింతకన్నా మరేం చెప్పలేకపోయింది.

నీలకంఠం నాలుగైదు వారాలు పయనించి ఊరు చేరుకున్నాడు. చేరుకోగానే దాసు అప్పటికి రెండు మూడు నెలలకు ముందే తిరిగి వచ్చేశాడన్న వార్త తెలిసింది. నీలకంఠం సరాసరి దాసు యింటికి వెళ్ళాడు. దాసు ఆనందంతో నీలకంఠాన్ని కౌగలించుకున్నాడు. "నేను పాపాత్ముణ్ణి నీలకంఠం! భగవంతుని సందర్శించుకోలేకపోయాను" అని వాపోయాడు. నీలకంఠం దాసు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుని "నువ్వలా అనకూడదు దాసూ! భగవంతుని అనుగ్రహానికి పాత్రుడైనవాడివి నువ్వు, నేను కాశికి వెళ్ళి విశ్వనాథుణ్ణి

దర్శించాననుకో! కానీ అప్పుడుకూడా నా హృదయం ఇక్కడే వుంది. నువ్వెక్కడున్నప్పటికీ నీ హృదయం భగవంతుడికి చేరువగానే వుంటుంది. ఇన్ని మాట లెందుకు దాసూ! నేను నిన్ను స్వామి సన్నిధిలో చూచాను. నువు...."

దాసు అతణ్ని మాట్లాడనీయకుండా "అంతా అతడి అనుగ్రహం నీలకంఠం! మనదేముంది" అని ఆ ప్రసంగానంతటితో ఆపేసాడు.

"నువ్వు కొద్ది రోజులపాటుండి వచ్చిన పల్లె టూళ్లో, నువ్వేమైనావని అడిగి తెలుసుకోడాని కెళ్లాను. వాళ్ళకు నువ్వు చేసిన...."

"మనం చేసేదేముంది నీలకంఠం! చేయించే వాడు పైన వున్నాడు. నువ్వు బాగా అలసిపోయినట్టు న్నావు. ఇంట్లో పాలున్నాయేమో • చూస్తానుండు" అంటూ దాసు లోపలికి వెళ్లాడు.

నీలకంఠం నిట్టూర్పు విడిచాడు. ప్రేమార్ద్రి మైన హృదయంతో తోడి మానవులకు సాయపడడం కన్నా మానవుడు చేయవలసిన ఘనకార్యం మరొకటి లేదనీ, కోటి పుణ్యక్షేత్రాలను తిరిగి రావడంకన్నా

నిస్వార్థంగా దీనమానవులకు సేవజేయడం ద్వారా అతడు భగవంతుని అనుగ్రహానికి పాత్రుడు కాగలడని నీలకంఠానికి అవగతమైంది.

( ఆధారం : టాల్‌స్టాయ్ )





వేటలో నిపుణులైన భటులు కొందరు వెన్నంటిరాగా భోజరాజు మృగయా వినోదంకోసం ధారానగరానికి రెండు ఆమడల దూరంలోగల అరణ్యానికి బయల్దేరాడు. ఆస్థానకవీంద్రుడు కాళిదాసుకూడా రాజుగారిని వెంబడించాడు.

మిట్టమధ్యాహ్నమైంది. భోజరాజు కవికోటాటు ఒక మర్రిచెట్టు నీడలో కూర్చుని సేద తీర్చుకుంటూ మెల్లగా సంభాషణకు ఉపక్రమించాడు. భటులు దూరంగా ఎక్కడో వంటలు చేసుకుంటున్నారు.

ఇంతలో కూత వేటుదూరంలో వున్న చెట్ల మాటునుంచీ ఒక పులి గాండ్రించడం అక్కడికి భయంకరంగా వినిపించింది. భోజరాజు ఖడ్గహస్తుడై లేచి నిలబడి "పులివేట ప్రత్యక్షంగా చూడాలన్న కుతూహలమూ, చూడ్డానికి కావలసిన ధైర్యమూ వున్నట్లయితే మీరూ నాతో రావచ్చు" అని కాళిదాసుతో నుడువుతూ, పులి అరపు వినవచ్చినవైపుకు వేగంగా నడవసాగేడు.

పిరికివాడనిపించుకుని రాజుగారి ఎదుట కించపడడానికి ఇష్టంలేక కాళిదాసు ఆయనను అనుసరించాడు. ఏపుగా పెరిగిన మద్దిమ్రానులమధ్య ఒక చిన్న సెలయేరు ప్రవహిస్తోంది. ఆ యేటిప్రక్కన చల్లటి నీడలో పడుకుని పులి ఆవలిస్తోంది.

"పృథ్వీపతీ అదిగో పులి" అన్నాడు కాళిదాసు.

"మీరు ఇక్కడేవుంటి చూస్తూ వుండండి" అంటూ భోజరాజు వెనుకనుంచీ పులిని సమీపించాడు. తొందరగా నడవడంలో ఎండుటాకులు గలగల

మన్నాయ్. పులి వులికిపడిలేచి అటూ, యిటూ చూచింది. రాజు ఒక్క అంజకో ముందుకు దూకి పులిపైకి కత్తి విసిరాడు. కాని పులి వెంట్రుకవాసిలో దెబ్బ తప్పించుకుని సెలయేరు దాటి ఆవలివైపు కకారణ్యంలోకి కాలి కొద్దీ పరుగెత్తసాగింది. దాని వెనువెంట రాజు, ఆయన వెంబడి కాళిదాసు పరుగెత్తసాగారు.

అలా ఎంతదూరం పరుగెత్తారో వాళ్ళకు తెలియదు. తీక్ష్ణంగా వుండిన సూర్యకిరణాలు క్రమక్రమంగా చల్లబడి పోయాయి. శరవేగంతో పరుగుతీస్తూ పెద్ద పులి ఏ పొదలచాటునో కనుమరుగై పోయింది. ఆయాసంతో రాజు, కవీ ఒక బండపైన కూచున్నారు.

సేరుకున్న తర్వాత కాళిదాసు రాజువైపు తిరిగి "ప్రొద్దు వాటారిపోయింది ధరణీపతీ! ఈ రాత్రికి మనం ఈ అరణ్యంలోనే వుండిపోవడం దేవరవారికి అభిమతం కాదుగదా!" అన్నాడు.

"లేదులేదు. మనకోసం భటులు ఎదురు చూస్తుంటారు: వెళ్దాంపదండి" అంటూ రాజుపైకి లేచాడు. ఇద్దరూ నడవసాగారు.

కాని ఎంతదూరం నడిచినా వాళ్లు బయల్దేరిన చోటు చేరుకోలేకపోయారు. తనపని తీరిపోయినట్టు సూర్యుడస్తమించాడు. దారితెన్నూ లేని అరణ్యంలో

దారి తప్పిన భోజరాజు దిక్కులు తోచక కాళిదాసును చూస్తూ "ఇక మనం నడచి ప్రయోజనంలేదు. ఇక్కడికి ధారానగరం ఏవైపున వున్నదోకూడా నేను వూహించుకోలేక పోతున్నాను.

"ఐనా మరికొంతదూరం నడుద్దాం అవధీపతీ! అప్పటికి చంద్రోదయంకూడా అవుతుంది" అన్నాడు కాళిదాసు.

మళ్ళీ ప్రయాణం కొనసాగింది. అటు చంద్రుడు వుదయించడ మేమిటి, యిటు రాజుగారికి, కవిగారికి ఒక కాలిబాట కనిపించడమేమిటి? ఒక్కసారే జరిగాయి.

"ఈ బాట మనల్ని ధారా నగరానికి కాక పోయినా ఒక చిన్న కుగ్రామానికైనా తీసుకు వెళ్ళదా మహారాజా" అన్నాడు కాళిదాసు.

"అందుకు సందేహ మేమిటి? మనం దుర్గమారణ్యాన్ని దాటి, అడవి పొలిమేరలో నడుస్తున్నాం. ఇంకొక అర్ధక్రోసు దూరంలో మనకు ఆశ్రయం దొరకవచ్చు" అన్నాడు భోజరాజు.

రాజుగారి అంచనా నిజమైంది. చంద్రబింబం నాలుగు బారలు ప్రొద్దెక్కేసరికి రాజూ, కవీ కాలిబాట

ప్రక్కన ఒక గుట్ట చెంతనున్న చిన్న పూరిగుడిసె ముందు నిలబడి మెల్లగా తలుపు తట్టారు.

"ఎవరు వారు" అంటూ ఒక ముసలావిడ తలుపు తెరిచింది.

"ఎవరైతేనేంలే అవ్వా! దారితప్పినబాటసారులం, ఈ బాట ఎక్కడికిపోతుందో. చెప్పగలవా నువ్వు" అన్నాడు కాళిదాసు.

ముసలావిడ ఏమీ అర్ధం కానట్టు కాళిదాసుకేసి విచిత్రంగా చూస్తూ "బాట ఎక్కడికి పోతుందిబాబూ! దానికేం కాళ్లున్నాయా ఒకచోటనుంచీ మరొక చోటకు నడవడానికి. అదెక్కడికీ పోదు. మనుషులు మాత్రం దానిపైన రాకపోకలు సాగిస్తుంటారు. అదలావుండని; మీ రెక్కడనుంచి వస్తున్నారు?" అంది.

"మేము యాత్రికులం అవ్వా! కాశీక్షేత్రంనుంచీ వస్తున్నాం" అన్నాడు కాళిదాసు.

"మీరు యాత్రికులా! పరాచికాలాడడానికి మీకి ముసలిది దొరికిందా బాబూ! లోకంలో సూర్య చంద్రులిద్దరుమాత్రమే కదా యాత్రికులు! మిగిలినవాళ్ల యాత్రికులంటే నేను నమ్మను" అంది వృద్ధురాలు.

ఈసారి మహాకవి కొంచెం తీవ్రంగా ఆలో చించి "మేము అనిత్యమైన జీవితంగల మానవులం అవ్వా" అన్నాడు.

"ప్రపంచంలో అనిత్యమైనవి రెండే రెండు. ఒకటియౌవనం, రెండోది సంపద వాటితో పోల్చిచూచి నప్పుడు జీవితం అనిత్యం కాదే!" అంది ముసలావిడ!

భోజరాజుకు చిరాకు కలిగింది. అతడు కొంచెం కటువుగా "చూస్తుంటే తెలియడంలేదా అవ్వా! మేము రాజులం" అన్నాడు.

"రాజులా నాయనా! బాగా చెప్పావు. అప్పటికి నేనంత మతిలేనిదాన్ననా నీ అభిప్రాయం. లోకంలో రాజులిద్దరే ఒకడు నెలరాజు,ఇంకొకడు ధర్మరాజు. ఐనా, నాతో మీకీ కుతర్కాలెందుకు? వాస్తవంగా మీ రెవరో ఒక్కమాటతో చెబుతే సరిపోదా" అంది వృద్ధురాలు.

భోజరాజు కీసారి కోపమే వచ్చింది. అతడు రెండడుగులు ముందుకువేసి "మహాతల్లీ! మేము ఓర్పు అన్నభూషణం ధరించిన వాళ్ళం కాబట్టి సరిపోయింది. లేకుంటే నీకిపాటికి ఎలాటి దుర్గతిపట్టి వుండేదోకదా" అన్నాడు.

"అదేమిటి బాబూ! ఓరిమిని అలంకారంగా గలిగిన వాళ్ళలో ఒకతి భూదేవి, మరొకతె మానవాంగన.

దుస్తులుబట్టి చూస్తే మీకూ పైవాళ్ళకూ పోలికలేవీ కనబడడం లేదే" అని విస్మయం ప్రకటించింది ముస లావిడ.

"మమ్మల్ని విసగించకమ్మా తల్లీ! తిరిగి తిరిగీ అలసిపోయాం. వాస్తవానికి మేము పరదేశస్థులం" అన్నాడు కాళిదాసు.

"పరదేశస్థులా నాయనా మీరు! ఏంమాట! ఒకటి పుట్టనైనా పుట్టాలి లేకుంటే చావనైనా చావాలి. అప్పుడుగాని పరదేశానికి వెళ్ళడం సాధ్యపడదు. పుట్టడమంటే పరదేశానికి రావడం. చావటమంటే పర దేశానికి పోవటం."

రాజు కవిగారి ముఖం చూచాడు. కవి రాజుగారి ముఖం చూచాడు. "ఓడిపోయాం, ఓడిపోయాం" అన్న భావం ఆ చూపుల్లో వ్యక్తమైంది. ఇక ఓటమిని అంగీకరించడమే సమంజసమనుకున్న కాళిదాసు "అవ్వా! ఇంకా వెయ్యిమాటలెందుకు? నీ దగ్గర మేము ఓడిపోయాం" అన్నాడు.

"అదేమిటి బాబూ! లోకంలో ఓడిపోయే వాళ్ళి ద్దరు. ఒకప్పుడు అప్పు తీసుకున్నవాడు! మరొకడు ఆడుబిడ్డను కన్న తండ్రి. వాళ్ళకు తప్పా మరెవ్వరికీ ప్రపంచంలో ఓటమిలేదే" అంది ముసలావిడ.



సిగ్గుతో మహాకవి తలవంచుకున్నాడు. భోజరాజు ముఖం వెలవెలబోయింది. వాళ్ళను చూచి ముసలావిడ నవ్వుతూ "ఎంత గడసరివాళ్లు బాబూ మీరు! మీ రెవరో నాకు తెలియదనుకుంటున్నారు గదూ! పొరబాటు. ఈ రాజ్యంలో మిమ్మల్ని తెలియనివాళ్లెవరు? వేటకు వెళ్ళి అరణ్యంలో దారితప్పినట్టున్నారు ఇటే వెళ్ళండి ఇదే ధారానగరానికి దారి" అంది.

[ఒక కన్నడ కథ ఆధారం]



ఒకానొక పల్లెటూళ్లో ఒక రైతు నివసించేవాడు. అతడి పేరు రుద్రయ్య. సాలీనా ఏభై పుట్లుపండే మాగాణి పొలాలు, ఏటి కటూ, ఇటూ రెండు కొబ్బరి తోటలూ, పెద్ద చుట్టు భవంతి ఇల్లు, రెండుజతల దుక్కిటెద్లు, నాలుగు గంగగోవులు, ఒక గొర్రెలమంద, ఇవీ అతడి స్థిరచరాస్థులు. పైగా కొండల్ని పిండిజేయడానికైనా సిద్ధంకాగల ముగ్గురు కుమారులున్నా రతనికి!

పెద్దవాడికి పెళ్ళయింది. రెండోవాడు పెళ్ళికి సిద్ధంగా వున్నాడు మూడోవాడికి పన్నెండేళ్లు. రుద్రయ్య భార్య మంగమ్మ ఇటు పొదుపరితనంలోనూ, అటు పది మందికి పెట్టిపోయడంలోనూ ఆ ప్రాంతంలో పేరెన్నిక గన్న ఉత్తమ ఇల్లాలు. కొంచెం నోటి దురుసుతనమే గనుక లేకుండావున్నట్లయితే ఆమెను 'అన్నపూర్ణ' అన్నా తప్పులేదు. ఆ కుటుంబానికి తగ్గట్టే, కలుపు తీయడం, వక్కకుప్పను తూర్పారబట్టడం, పదాలు పాడడం మొదలైన కర్షకుల కళ్ళల్లో కాకలు తీరిన కాపుపడుచు కనకమ్మ కోడలుగా ఇంట్లో ప్రవేశించింది. ఆ ఇంట్లో పనిచేయలేనివారు, ఏడేళ్లుగా క్షయరోగంతో బాధపడుతూ మంచాన్ని ఆశ్రయించుకునివున్న రుద్రయ్య తండ్రి ఒక్కడే రుద్రయ్య ప్రపంచంలో తన కిక కోరదగిన సౌఖ్యమే లేదన్నట్టు నిశ్చింతగా కాలం వెళ్ళ బుచ్చేవాడు. ఆ ఇంట్లో ఎప్పుడూ ధాన్యలక్ష్మి దర హాసం చేస్తూండేది. కొబ్బరితోటలపైన వచ్చే మాసూలు సంవత్సరమంతా ఖర్చుబెట్టినా తరిగేదికాదు. వాస్త వానికి రుద్రయ్య తన బ్రతుకునంతా ఒక తీయటి కలలా, ఒక శ్రావ్యగానంలా ఒక దివ్యప్రబంధంలా హాయిగా గడిపేసివుండవచ్చు. కానీ మానవజీవితం ఒక ప్రవాహంలాటిది. దానికి ఒడుదుడుకులు సహజం!

ఉన్నట్టుండి రుద్రయ్యకు, అతని పొరుగింటి వాడైన భీమయ్యకు ఏదో వివాదం వచ్చిపడ్డది. ఈ ఇంటిపైన కాకి, ఆ ఇంటిపైన వాలితే కర్రలు, కత్తులు తీసుకుని రుద్రయ్య పుత్రసమేతుడై, భీమయ్య సపరివారుడై నడివీధిని కురుక్షేత్రంగా మార్చేంతవరకూ ఆ వివాదం విషమించింది. రుద్రయ్య తండ్రి కుటుంబ యజమానిగా వుండిన కాలంలో ఆ రెండు కుటుంబాలు ఎంతో అన్యోన్యంగా వుండినట్టు గ్రామస్థులు చెప్పుకుంటారు. ఆ మాట అక్షరాలా యథార్థమే. అప్పట్లో ఒకరింటి గేదె దారితప్పి మరొకరి చిక్కుడుపాదులో పడినప్పటికీ, వాళ్ళు మరేం ఆగ్రహపరవశులై పోక, ఆ గేదెని నెమ్మదిగా కొట్టానికి తోలి 'దాన్ని కొంచెం జాగ్రత్తగా కట్టుకోండి' అని మందలించేవాళ్లు. అంతే గానీ, ఆ గేదెని పెద్ద బాణాకర్రతో చిదకగొట్టి, దాన్ని సరిగ్గా అదుపులో ఉంచుకోనివాళ్ళపైన శాపనార్థాలు గుమ్మరించి పెద్ద కొట్లాట జరిగేవరకు ఆ సంఘటనని సాగదీసేవాళ్ళు కారు.

కాలం మారిపోయింది. అప్పుడు చిన్న పిల్లలుగా వుండిన వాళ్ళు పెద్దవాళ్ళై గృహ యజమానులు కాగానే ఆ రెండుకుటుంబాల మధ్య స్పర్ధలు పుట్టి, పెరిగి శీఘ్ర కాలంలో శృతిమించిపోయినయ్.

ఇంతకూ అదంతా నిష్కారణముగా ప్రారంభమైన వివాదం!

ఒకరోజు రుద్రయ్య కుటుంబం తాలూకు కోడి పెట్టొక్కటి ఎక్కడికో పరారై పోయింది. అందరూ దానికోసం ఊరంతా వెదికారు. వాళ్ళు వెదకీ వెదకీ వేసారిన తర్వాత అది భీమయ్య ఇంటి పెరటినుంచీ మెల్లగా ఈవలికి వచ్చింది. తక్షణం కనకమ్మ భీమయ్య ఇంటికి వెళ్ళి "మా కోడి పదిరోజులుగా గ్రుడ్లు పెడుతోంది. ఈరోజు మీ పెరట్లో ఎక్కడైనా పెట్టి వుంటుంది. కాస్త దాన్నిలా తెచ్చి ఇవ్వండి" అన్నది. ఎందుకోగానీ ఆ మాటలు భీమయ్య భార్యకు ఆగ్రహాన్ని కలిగించాయి. "ఆమె ఒక్క విసురుతో లేచివచ్చి" మీ కోడి ఇక్కడెందుకు గ్రుడ్లు పెడ్తుంది? ఐనా నువ్వెందుకో వృథాగా మమ్మల్ని ఆడిపోసుకుంటున్నావమ్మా, అదేం కాలానికోగానీ! మాకూ కోళ్ళున్నాయి. అవి పెట్టే గ్రుడ్లే మాకు చాలు. మేము ఒకరి సొత్తుకు ఆశించేవాళ్ళం కాము" అన్నది.

"ఐతే మేమా మరొకరిసొత్తుకు ఆశించే వాళ్ళం?" అని కనకమ్మ మాటను సాగదీసింది.

ఆ తర్వాత ఆ ఆడవాళ్ళిద్దరూ అంతకు పూర్వం జరిగిన సంఘటన లన్నిటినీ నెమరుకు దెచ్చుకుని,

'నువ్వు దొంగవు' అని ఒకరంటే 'నువ్వు దొంగవు' అని మరొకరు, 'నువ్వు చుప్పనాతివి' అని ఒకరంటే 'నువ్వు ముసలాడికి తిండిపెట్టకుండా చిత్రహింస చేస్తున్న రాకాసివి' అని మరొకరు, ఇలా వ్యవహారాన్ని మాంచి రసకందాయంలోకి తీసుకొచ్చేశారు.

ఇంతలో పొలంనుంచి తిరిగి వచ్చిన మగవాళ్లు తమతమ ఆడవాళ్ళకు అంగరక్షకులుగా, సాయుధులై రణరంగంలో ప్రవేశించారు. రుద్రయ్య భీమయ్యనొక్క తోపుతో క్రిందికితోసి, అతని జుట్టును గట్టిగా పట్టుకొని వీపుపైన దుడ్డుకర్రతో ఒక ప్రేటిచ్చాడు. క్రిందపడిన భీమయ్య రెండు కాళ్ళతో రుద్రయ్యను రెండు పొర్లికలు వేసేట్టు తన్నాడు. ఆడవాళ్లకూడా శక్తివంచన లేకుండా ఒకరిపైన మరొకరు పడి చీరల్ని చింపుకుంటూ ముఖాల్ని గీక్కుంటూ, కొప్పుల్ని ఊడబెరుక్కుంటూ, మొత్తంమీద ప్రేక్షకులుగా అక్కడ చేరిన గ్రామస్థులకు ఆడవాళ్లుకూడా కుస్తీపట్టు వచ్చునని నిరూపించారు. ఇంకా ఆ కుస్తీలను చూస్తూ ఊరుకోడానికి ఓపరికం లేకనేమో, గ్రామస్థులు ఆ రెండు ముఠాలకు మధ్య రిఫ్రీలుగా నిలిచి, నాగరికమైన కొట్లాట పద్ధతుల్ని గూడా అతిక్రమించి మోటుగా ఒకరి తలవెంట్రుకల్ని మరొకరు

ఊడబెరుక్కున్నందుకు మందలించి ఎవరెవరిళ్ళకు వాళ్ళని పంపించేశారు.

ఇలా ప్రారంభమైంది కలహం? భీమయ్య తన భార్య కొప్పులోనుంచి ఊడిపోయిన వెంట్రుకల్ని ఒక కాయితంలో చుట్టి, దానితోబాటు ఒక అర్జీని జతచేసి కోర్టులో వ్యాజ్యం వేశాడు.

అర్జిలో అతడిలా వేడుకున్నాడు: "న్యాయాధిపా! నా భార్య శ్రమపడి దీర్ఘ శిరోజాలను పెంచుకున్నది. మల్లెలు, మొల్లలు, చేమంతులు మొదలైన పువ్వుల్ని వుంచుకోడానికే గానీ, రుద్రయ్య భార్య యొక్క కోపావేశానికి ఆహుతై క్రింద రాలిపోవడానికి కాదు. నాకు న్యాయం కలగజెయ్యండి."

భీమయ్య భార్య అలిమేలు తన భర్త పట్నంనుంచీ తిరిగివచ్చిననాటినుంచి "ఊళ్లోకారు దౌర్జన్యాలు జరపడానికి! అయ్యగారికి సరయిన శాస్తి జరుగుతుంది. రెండుమూడేళ్ళయినా కఠినశిక్ష తప్పదు" అని ప్రచారం చేసింది.

రుద్రయ్య కుటుంబంలో మంచంపైని ముసలివాడు తప్పా, మిగిలినవాళ్ళందరూ భీమయ్యను సర్వనాశనం చేసేందుకు మార్గాలు వెదుకసాగారు. వృద్ధుడు మాత్రం కొడుకుతోనూ, కోడలుతోనూ ఏదో వదరు

తోనే వుండేవాడు: "ఎన్నేళ్ళు వస్తేనేమి, మీకింకా కుర్రతనం పోలేదు. ఎందుకర్రా అందరూ ఇలా తెట్ట తేరకు అల్లరిపాలై బోవడం? కొంచెం ఆలోచించి చూడండి. ఇంత వివాదమూ ప్రారంభమయింది ఒక కానీకైనా కొఅగాని కోడిగుడ్డును గురించి! ఇలాగే మీరు ఒకరిమీద మరొకరు కారాలు మిరియాలు నూరు కోవడం కలకాలం సాగించితే కోడిగుడ్డుతో ప్రారంభ మైన కలహం కొంపల్ని ముంచుతుంది."

ఆ వయోవృద్ధుడి మాటల్ని ఎవరూ చెవిలో వేసు కోలేదు. మతి భ్రమించడంవల్ల వాస్తవపరిస్థితుల్ని గుర్తించలేక ఏదో వదురుకుంటున్నాడనుకున్నారు. రుద్రయ్యకూడా బస్తీకి వెళ్ళి ఆడవాళ్ల తలవెంట్రుకల్ని పెరికివేయడంలో భీమయ్య భార్యకూడా సిద్ధహస్తు రాలేననికేసును విచారించి ప్రతివాదులమీద తగుచర్య తీసుకోవలసిందనీ కోర్టులోఫిర్యాదు చేసి వచ్చాడు. ఈ వ్యవహారం జరుగుతూండగానే ఒక రోజు భీమయ్య వీధిలో నిలిపివుండిన బండి తాలూకు కాడిమానొకటి మాయమైపోయింది. అలిమేలు రుద్రయ్య కొడుకే ఆ దొంగతనం చేసివుంటాడని, అనేక కల్పనలతో ధ్రువ పరచింది. మళ్ళీ భీమయ్య పట్నానికివెళ్లి మొదటి కేసుకు అనుబంధంగా రెండోకేసును జతచేసి వచ్చాడు.

# 2

వివాదంలో రెండవఘట్టం ప్రారంభమైంది. ఒక కుటుంబానికి చెందినవాళ్ళు మరో ఇంటివాళ్ళ పశువుల్ని దొంగలించడమే అను దినకృత్యంగా ఏర్పరచుకున్నారు. రుద్రయ్య తన భార్యకూ, కొడుకులకూ భీమయ్య ఆస్తిలో దేన్ని దేన్ని సులభంగా కాజేయవచ్చునో, కాజేయడాకి అవలంబించవలసిన విధానాలేమిటో వివరించి చెప్పేవాడు. భీమయ్యకూడా దొంగతనమనే కళను అనేక పాఠాలుగా విభజించి, ప్రతి పాఠాన్ని సవివరంగా తనవారికి బోధించాడు. ప్రతి రోజూ వీళ్ళవి, వాళ్ళవి కొన్ని వస్తువులు మాయమైపోవడం రివాజైపోయింది. ప్రతి వస్తువు మాయమైనప్పుడూ కోర్టుకు తిరగడం పరిపాటైపోయింది. జడ్జికి ఈ వివాదంవల్ల తల దిమ్మెక్కిపోయింది. అతడు నిష్పక్షపాతంగా ఒకప్పుడు రుద్రయ్యకు మరొకప్పుడు భీమయ్యకు జరిమానాలువేసి, కారాగారవాసం విధించి శిక్షించాడు. ఆ శిక్షలుకలహానికి మరింత వుపకరించాయి.

ఇలా ఆరేళ్ళ దీర్ఘకాలం పొడుగునా ఈ కలహం దిన దినాభివృద్ధి చెందింది.

మంచాన్ని ఆశ్రయించుకుని వున్న ముసలివా డొక్కడు మాత్రం ఈ జగడాల్ని అరికట్టాలను కున్నాడు. కాని అతని సదోృధ బూడిదలో పోసిన పన్నీరైంది.

ఏడవ సంవత్సర ప్రారంభంలో ఊళ్లో ఒక రింట్లో పెళ్ళి జరిగింది బంధులోకం సమక్షాన కనకమ్మ భీమయ్యా చేసిన దురాగతాల్ని వల్లించి, అతడు చోర వృత్తితోనే జీవిస్తున్నట్టు నేరం ఆరోపించింది. చాటుగా వుండి ఆమె మాటల్ని విన్న భీమయ్యా కోపం పట్టలేక ఈవలకి వచ్చి ఆమె వీపుపైన గుద్దుల వర్షాన్ని కురి పించాడు. అప్పుడు కనకమ్మ నిండు గర్భంతో వుంది. ఆమె దెబ్బలను తాళలేక స్మారకం తప్పి కుప్పకూరలా నేలపైన పడిపోయింది. ఆమె దురవస్థని చూచి రుద్రయ్యా సంతోషపరవశుడై పోయాడు!! ఈ కేసు నుంచీ భీమయ్యా గడచి గట్టెక్కలేడనీ, ఈ దఫా అతనికి పదేళ్ళ కఠిన శిక్షయినా పడడం నిస్సందేహ మనీ మురిసిపోయాడు! కానీ, పాపం అతనికి కోర్టులో ిగాశే ఎదురైంది. మేజస్ట్రేటు ఆ కేసును పూర్తిగా ించలేకపోయాడు. రుద్రయ్యా వకీళ్ళకు ఎంత

ఫీజు గుప్పించినా, గుమాస్తాలకు ఎంత లంచం ధార బోసినా అంతా వృథా అయింది. భీమయ్యను ఇరవై లాటీ దెబ్బలతో మాత్రం సత్కరించవలసిందిగా తీర్పు చెప్పబడింది!

కోర్టులోనుంచి బయటకు వచ్చిన భీమయ్య ఇలా గొణుక్కోవడం రుద్రయ్య చెవులు నిక్కించి విన్నాడు: "కానీ, కానీ! ఇక్కడ ఇరవై దెబ్బలతో నా వీపు మండుతుంది. కానీ అక్కడ వాడి కొంపే మండకపోతుందా?"

తక్షణం రుద్రయ్య కోర్టులోనికి పరుగెత్తి భీమయ్య తన ఇంటికి నిప్పంటించపోతున్నట్టు బెదరిస్తున్నాడని మేజస్ట్రేటుతో మనవి చేశాడు.

మేజస్ట్రేటు మళ్లీ భీమయ్యను పిలిపించి "నువ్వలా అన్నావా! అని ప్రశ్నించాడు.

"అబ్బే, నేను నోరే తెరువలేదు! నన్ను కొట్టండి! కొట్టే అధికారం మీ చేతిలోవుంది. మంచి వాడికేగదా ఈ ప్రపంచంలో కష్టనష్టాలు! నేనైతే మీకు లోకువైపోయాను. వాడేంచేసినా మీరు పట్టించు కోవడం లేదు."అన్నాడు భీమయ్య.

మేజస్ట్రేటుగారికి ఈ రైతులిద్దరూ వ్యవ రాల్లోదిగి కొంప గుల్ల చేసుకోవడమేమీ నచ

ఎలాగైనా వాళ్ళకు రాజీ కుదిరించి, వాళ్ళకాపురాలు నిలబెట్టాలనుకున్నాడాయన. పోరు నష్టమనీ, పొందు లాభమనీ వాళ్ళకు చెప్పి చూచాడు. కానీ వాళ్ళల్లో ఎవరుగానీ రాజీకి సుముఖులుగా లేరు.

మేజస్ట్రేటుగారి హితోపదేశమంతా శ్రద్ధగావిని భీమయ్య ఇలాఅన్నాడు: "నాకిప్పుడేభై ఏళ్ళు. నాకునలుగు రైదుగురు కొడుకులున్నారు. వాళ్ళకు పెళ్ళిళ్ళుచేశాను. గంజికిలేని సంసారానికి ఘరానాగా బ్రతికే వెసులుబాటు కలిగించాను. పదిమందిలో గౌరవంగా బ్రదికాను. ఎప్పుడూ కోర్టు మెట్లెక్కి లాటి దెబ్బలు తినలేదు. ఈ నాటికీ మహానుభావుడు నన్నీగతికి తీసుకొచ్చాడు. ఆయనగారితోనా నాకు రాజీ! వద్దు వద్దు. వాడితో రాజీకి దిగడంకన్నా గంగలోదూకి చస్తా".

భీమయ్య తర్వాత మాట్లాడలేకపోయాడు. అతడి కంఠం గద్గదికమైపోయింది.

# 3

రుద్రయ్య బస్తీనుంచి ఇంటికితిరిగి వచ్చేసరికి సూర్యు డస్తమించాడు. అతడి కొడుకులు పొలంనుంచి ఇంకా రాలేదు. ఆడవాళ్ళు పెరట్లో చిక్కుడు పాదులకు నీళ్లు బోస్తున్నారు. అతడు ప్రయాణ బడలికతో ఇస్సురని నిట్టూరుస్తూ తండ్రి మంచం దగ్గర కూలబడ్డాడు.

"ఏమైంది బాబూ కేసు?" అన్నాడు ముసలాడు.

"ఏమౌతుంది! ఇరవై లాటీదెబ్బలు వీపు వాచేట్టు."

"ఎంత ఘనకార్యాన్ని సాధించావురా అబ్బాయీ! వాళ్లు అతణ్ణి చావగొట్టేస్తారనికూడ అనుకో, అందువల్ల నీకేం ఒరుగుతుంది?"

"నాకు ఒరిగే దేమిటి? వాడింకా అలాటి పనులు చేయడు."

"ఏలాటి పనులు చేయడు? అసలు అతడు నువ్వు చేసిందానికన్నా దుష్కార్యం చేశాడనేనా నీ నమ్మకం?"

రుద్రయ్యకు కోపం వచ్చింది. "నేనేం చేశాను? గర్భంతోవున్న ఆడదానిపైన చెయిజేసుకున్నానా? ఇంటిని కాల్చేస్తానని బెదిరించానా?" అన్నా డతడు.

వృద్ధుడు మెల్లగా నవ్వి, ఓపిక తెచ్చుకొని ఇలా అన్నాడు: "ఒరే బాబూ! నేను మంచంపైనుంచీ లేవలేనివాణ్ని. నువ్వు ప్రపంచమంతా చుట్టిరాగల శక్తి



వున్నవాడివి. అందువల్ల నువ్వు నాకు బొత్తిగా లోకానుభవం లేదనుకుంటున్నావు. నీకన్న నేను పెద్దవాణ్ణి. మంచో, చెడ్డో చెబుతున్నా విను. నువ్వొక వ్రేలితో మరొకనిలో వున్న దోషాన్ని చూపిస్తున్నావు. కానీ మూడు వేళ్లు నీవైపుకే వంగి 'నీలో ఇరుమిక్కిలిగా దోషాలున్నా' యంటుండడం నువ్వు గమనించడం లేదు. అత డేదో చెడ్డపని చేసినట్టు చెబుతున్నావు. అతడు మాత్రమే ఆ కార్యం చేస్తే ఇంత కొట్లాట ఎందుకు వచ్చింది? ఒక చేతితోనే గాలిని తట్టితే శబ్దం వస్తుందా? రెండు చేతులు కలిస్తేగానీ శబ్దంరాదు. నేనూ ఏభై ఏళ్ళు సంసారసాగరంలో ఈదినవాణ్ణే. భీమయ్య తండ్రీ, నేనూ ఒక కంచాన తిని, ఒక మంచాన పడుకున్నాం. ధాన్యంగానీ, ధనంగానీ అతనికి లేకపోతే నేను, నాకు లేకపోతే అతడు ఇచ్చి పుచ్చుకునేవాళ్ళం. ఇప్పుడు నువ్వేం చేస్తున్నావ్? అతనితో స్నేహంగా వుండకపోతే పోతివి. అంతటితో ఊరుకోరాదా? అతడి పొలంలో చాటునా, మాటునా ఆవుల్ని తోలేయమని నీ కొడుకులకు హుకుం ఇచ్చేశావు! ఆ ఇంటివాళ్లు పొలాలకు వెళ్లినప్పుడు పొట్లకాయలు, చిక్కుడుకాయలు కోసుకుని వచ్చేయండని నీ భార్యకు, కోడలికి ఆర్డరు ఇచ్చేశావు! ఆలోచించు ఇదంతా

బాగుందా? వాడు నీ చెంపపైన వ్రేటేస్తే నువ్వూ అదే పని చేస్తావా? తప్పుకదూ! గాంధీజీ ఏమన్నాడు? 'ఎవ డైనా నిన్ను కొట్టితే, ఊరుకో. చచ్చినట్టు వాడే పశ్చా త్తాపపడతాడు' అనలేదూ! ఏం? నా మాటలు నీకు నచ్చ లేదూ!"

వృద్ధుని కింతలో దగ్గు వచ్చింది. ఆయాసం ఎక్కువైంది. కొంతసేపటికి సమాళించుకుని ఇలా అన్నాడు: "పోనీ, ఈ కలహంవల్ల నీకు ఇంతో, అంతో లాభమేమైనా కలుగుతోందా? ఈ ఏడుపంట లన్నీ బొత్తిగా చెడిపోయాయిగదా! నీకు కోర్టుకు వెళ్ళి రావడంతోనే సరిపోతుందాయె! కుర్రవాళ్ళకు పొరుగింటి పైన పగతీర్చుకోడానికి వెరవులు వెదకడంతోనే సరి పోతోందాయె! కలుపు తీయకపోవడంచేత చల్లిన వరిపైరు సరిగ్గా పండలేదు. మిరపతోట నీళ్లు కట్టక పోవడంచేత ఎండిపోయింది. ఇంక ఒకటి రెండేళ్ళు ఇలా జరిగితే మళ్ళీ నువ్వు కోలుకోగలవా?"

రుద్రయ్య తండ్రి మాటల్లోని సత్యాన్ని గుర్తిం చాడు. ఎలాగైనా కలహానికి స్వస్తి చెప్పి, ఆరేళ్లకు మునుపటిలాగా నిశ్చింతతో కాలం గడపదలచు కున్నాడు. కానీ ఈ ప్రపంచంలో మానవుడు ఒకటి అనుకోవడం, భగవంతుడు మరొకటి అనుకోవడం

పరిపాటి! పెరట్లోనుంచి ఇంట్లోకి వచ్చిన ఆడవాళ్ళు, తమ కుటుంబంలోనున్న ఆలియుమగళ్ళనీ, తండ్రికొడు కుల్నీ విడదీసి, చెట్టుకొకణ్నిగా పుట్టకొకణ్నిగా చేసి ఇంటింటికి తిరిగి భిక్షమెత్తుకునేట్టు చేసేటట్టు భీమయ్య వీధిలో ప్రతిజ్ఞలుపలుకుతున్నాడని రుద్రయ్యతో చెప్పారు. అంతటితో రుద్రయ్య కలలోనుంచి మేలుకొన్నట్టు తటాలున పైకిలేచి "ఆఁ ఆ అప్రయోజకుడు చేస్తాడు! మిగతావాళ్ళు ఊరుకుంటారు!!" అన్నాడు.

## 4

మంగమ్మ నట్టింట్లో దీపం వెలిగించింది. కుర్ర వాళ్లు పొలాలనుంచి తిరిగి వచ్చారు. వాళ్ళారోజున చేసిన పనేమిటో తెలుసుకునేందుకు రుద్రయ్య బయ టికి వచ్చాడు. కోడెదూడ ఒకటి పగ్గం తెంపుకొని వీధివైపు పరుగెత్తుతోంది. రుద్రయ్య దాన్ని పట్టుకొని వచ్చి కంబానికికట్టి మంద దగ్గరికి వెళ్లాడు. ఆ రోజు అమావాస్య. దగ్గరున్న వస్తువులుగూడా స్పష్టంగా కనపడ్డంలేదు. పైగా ఆకాశం మబ్బులుగూడా అలుము కుంటున్నాయి. రుద్రయ్య పెరటిలో వుండగానే కారు

చీకటి తెరలు ప్రపంచాన్ని పూర్తిగా ఆవరించు కున్నాయి. అతని కెందుకో ఆ సమయాన మనసులో భీతి పుట్టింది. రోడ్డు దగ్గర భీమయ్య అన్నమాటలు అతని వీనుల్లో ధ్వనింపసాగినాయ్. "వాడి కొంపే మండకపోతుందా?" అబ్బ ఎంతభయంకరంగా వుందా మాట!

రుద్రయ్య మనసులో విపరీతమైన ఆలోచనలు పొడచూప సాగినాయ్. "వాడిప్పుడు సులభంగా కంచెను తొలగదోసుకుని పెరట్లోకి రావచ్చు. రావచ్చు నేమిటి, వస్తాడు! మెల్లగా ఒక అగ్గిపుల్ల గీసి కసువు వామిలో పారేసి వెళ్లిపోతాడు. ఇల్లు, పశువుల కొట్టం, ధాన్యపు గాదెలు అన్నీ కాలిపోతాయ్. నేను వాడిమీద కేసు పెట్టవచ్చు. కానీ సాక్ష్యం దొరకదు. అగ్గి పెడు తున్నప్పుడు నేనే గనుక వాడిని పట్టుకుంటేనా...."

కసవు వామికి వెనుకవైపు నుంచి చరచరా మన్న శబ్దం విన వచ్చింది. రుద్రయ్య పిల్లిలా మెల్లగా అడుగులు వేసుకుంటూ అటువైపుకు వెళ్లాడు. చిన్న వెల్తురు దృగ్గోచరమైంది. అది ఒక క్షణం సేపు. రుద్రయ్య దూరంగానే నిలబడ్డాడు. మళ్ళీ ఒకసారి వెలుగు పుట్టింది. ఆ వెలుగులో ఒక వ్యక్తి కనబడ్డాడు. గుప్పెడు కసవును మండుతున్న అగ్గిపుల్లతో ముట్టిస్తు

న్నాడావ్యక్తి! రుద్రయ్య పరకాయించి చూచాడు. సందేహం లేదు, వాడు భీమయ్య. "కానీ వాడు తీరా అగ్గిపెట్టేయనీ, తర్వాత వాడిని పట్టుకొని రాతికూసానికి నిలదీసి కట్టేసి, పదిమంది సాక్షులతో కేసును కోర్టుకు తీసుకెళ్తాను" అనుకున్నాడు రుద్రయ్య.

ఇంతలో వామి ఒక మూలనుంచి మండ సాగింది. ఒక్క ఉదటున రుద్రయ్య భీమయ్య పైకి లంఘించాడు. కానీ, భీమయ్యకూడా తగు జాగ్రత్త లోనే వున్నాడేమో. అతి చాకచక్యంతో పట్టు విడిపించు కుని, ఒక పరుగుతో కంచెను దాటుకుని వీధిలో పడ్డాడు. రుద్రయ్య కాలిపోతున్న వామినిగురించి ఆలోచించలేదు. "పట్టుకోండి దొంగ. ఖూనికోరు కొంప ముంచేశాడు" అంటూ భీమయ్య వెంట బడ్డాడు.

ఇలాటి కేకలు వినరావడం సహజమే కాబట్టి, గ్రామస్థులెవరూ వీధిలోనికి రాలేదు. భీమయ్య శర వేగంతో తన ఇంట్లో ప్రవేశించి తలుపుమూసి గడియ వేసుకోబోయాడు. కానీ రుద్రయ్య అతని వెనువెంటనే లోపలికి దూకి "ఎక్కడికి పోతావురా ద్రోహీ!" అంటూ జుట్టు పట్టుకున్నాడు. భీమయ్యకు దిక్కులు తోచలేదు. అత డొక బడితెను తీసుకుని రుద్రయ్యను చావ మోదేశాడు. రుద్రయ్య స్మారకం తప్పి కిందపడి

పోయాడు. భీమయ్య అతణ్ని మోసుకెళ్లి వీధిలో పారేశాడు.

రుద్రయ్య కళ్ళు తెరిచేసరికి అర్ధరాత్రయింది. అతని కళ్ళకు ఊరు కనపడలేదు. మొండిగోడలు కనపడ్డాయి!! "మన ఇల్లే కాదు, ఊరంతా కాలిపోయింది నాన్నా" అన్నాడు చిన్న కొడుకు. రుద్రయ్య కొకసారి గొంతెత్తి ఏడిస్తే బాగుండుననిపించింది. అతడు "నేను మొదటనే మంటను ఆర్పేసివుంటే...."అని పలుమారు గొణుక్కున్నాడు.

## 5

తెల్లవారబోతూందనగా కనకమ్మ పరుగెత్తి వచ్చి తాతయ్య చావుబ్రతుకుల మధ్య అవస్థపడు తున్నాడు మామయ్యా మర్రిచెట్టుక్రింద! నిన్నొకసారి రమ్మంటున్నాడు" అన్నది. రుద్రయ్యకు మనసు స్వాధీనంలో లేదు. "ఏమిటీ! చావుబ్రతుకులా! నన్నే రమ్మంన్నాడా?" అంటూ ఆశ్చర్యపోయాడు. అక్కడున్న పదిమందీ అతనికి పరిస్థితి వివరించి చెప్పారు. రుద్రయ్య నడవలేక నడుస్తూ తండ్రిదగ్గరికి వెళ్ళి కూలబడ్డాడు. వృద్ధుడి ముఖాన జీవకళ అంతరించిపోతోంది. కొడుకును చూడగానే కన్నుల్లోనుంచి మాత్రం ఒక వింత తేజస్సు పొంగిసలాడింది. నిజానికా అవస్థలో అతనికి మాట్లాడానికే శక్తి లేదు. కానీ కొడుకుతో ఆఖరు సలహా చెప్పడానికి మాత్రం అతడు బ్రతికివున్నాడు.

"ఎంత పని జరిగిందిరా తండ్రీ! ఊరి కెవరు నిప్పంటించింది?" అన్నాడతడు.

"వాడే నాన్నా, భీమయ్య! వాణ్ని తరిమి పట్టుకున్నాను. కానీ తప్పించుకున్నాడు. నేను వాడి వెంట

బడకుండా మంటను మొదటనే ఆర్పేసివుంటే ఇంతపని జరిగేది కాదు" అన్నాడు రుద్రయ్య.

"రుద్రయ్యా చనిపోతున్న నాతో అబద్ధం చెప్పకు. ఎవరిది తప్పు?"

రుద్రయ్య నిర్ఘాంతపోయాడు. అతడి నోట మాట రాలేదు.

"దేవుడిముఖం చూచి నిజం చెప్పు. ఊరు సర్వ నాశనమైపోవడానికి ఎవరు బాధ్యులు?"

రుద్రయ్య కళ్ళల్లోనుంచీ అశ్రువులు జలజల రాలాయ్! "తప్పు నాదే నాన్నా" అన్నాడతడు!

వృద్ధుడు కుమారుని చేతుల్ని తీసి తన గుండె పైన వుంచుకున్నాడు. తరువాత అతడి తల నిమురుతూ "ఇంకేం చేస్తావు, ఇంకేం చేస్తావు" అన్నాడు.

"ఏంచేయను నాన్నా! నాకేమీ తోచటం లేదు" అన్నాడు రుద్రయ్య.

వృద్ధుడు కళ్ళుమాసుకుని "నేను చనిపోతున్నాను తండ్రీ! ఇప్పుడైనా నా మాట విను. నీ వామికి నిప్పంటించింది భీమయ్యేనని ఎవరితోనూ చెప్పకు. అతడి అపరాధాన్ని మఱచిపో. నువ్వొకరి నేరాన్ని మన్ని

చితే, నీ నేరాల్ని భగవంతుడు క్షమిస్తాడు" అన్నాడు. అతడి చేయి కుమారుడి తలమీదనుంచి క్రిందపడి పోయింది. అతడు శాశ్వతంగా కళ్ళు మూసుకున్నాడు!

ఊరు కాలిపోవడానికి కారణమేమిటో గ్రామస్థులకు తెలియలేదు. ఆ రహస్యాన్ని రుద్రయ్యెందుకు బట్టబయలు చేయ్యలేదో భీమయ్యకు అర్థంకాలేదు. మొదట అతడు రుద్రయ్యను చూచి భయపడ్డాడు. కాని రుద్రయ్య అతని దగ్గరకు వెళ్ళి చనువిచ్చి మాట్లాడాడు. అంతటితో వివాదం అంతమైంది. కాలిపోయిన ఇళ్ళను తిరిగి కట్టుకున్నప్పుడు ఆ రెండు కుటుంబాలూ ఒక్క గుడిసెలోనే నివసించాయి.

[ ఆధారం : లియోటాల్‌స్టాయ్ ]

కథలు కథలు

ఇంకా..........

మామకథలు

కొంటెకిష్టు

గులాబీబాల

బాలక చదువు

ఛప్రాసీ

బాలకథామాల

పుట్టినరోజు

కథలు కథలు



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA118B164 |
| పుస్తకం పేరు | వనభోజనం |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 165 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | Ci, BCi |
| లేని పేజీలు | 109, 110 |
| తయారు చేసినది | vedavathi |
| పేజీలు విడదీసినది | vedavathi |
| స్కాన్ చేసినది | Haseena |
| పరీక్ష చేసినది | pragathi |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |